## ప్రకటన

శనివారం 14వ తేదీ శ్రావణ పూర్ణిమ మా కార్యాలయానికి సెలవు. అందువల్ల 15-వ తేదీ ఆదివారం సంచిక వెలువడదు. ఆదివారం సంచిక సారస్వతానుబంధం నేటి పత్రికలోనే ప్రకటించుచున్నాము. మేనేజరు.

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ శ్రావణ శు॥ పూర్ణిమ 1954 సం॥ అగస్టు 14 శనివారం శు॥ పూర్ణిమ 16-31 శ్రవ 8-37 వర్జ్యం 12-26 ల 13-58 ఘ. శ్రావణపూర్ణిమ. బ॥ ప్రథమ అగస్టు 15 ఆదివారం బ॥ ప్రథమ 14-35 ధని 7-34 వర్జ్యం 14-20 ల 15-50 ఘ.

ఆంధ్రపత్రిక

శ్రీ జయ సం॥ శ్రావణ శు॥ పూర్ణిమ శనివారం

## ఆగస్టు 15

స్వతంత్ర భారతదేశ చరిత్రలో మరొకవుట పూర్తి అయినది. 1947 ఆగస్టు 15వ తేదీన దేశము సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందినప్పట్నుంచీ క్రమక్రమముగా ఆర్థిక, రాజకీయ, సాంఘిక వ్యవస్థలు క్రమక్రమముగా అభివృద్ధిచెందుతున్నవి. ప్రజల ఆర్థికస్థితి కొంతవరకు బాగుపడినది. పాత సమస్యలు అనేకము పరిష్కారమైనవి. భారత రాజ్యాంగము స్థిరపడినది. దేశ సర్వతోముఖాభివృద్ధికి రాజ్యాంగము ఉపకరించగలదని ఋజువైనది. కృషికి తగిన ఫలితాలు ప్రజల అనుభవానికి ఇంకనూ రానిమాట వాస్తవమే. కాని "కృషితో నాస్తి దుర్భిక్షమ్" అన్నట్లే దేశ ఆహార సమస్యాపరిష్కారానికి, దేశాన్ని ఆహారం విషయంలో స్వయం సమృద్ధం చేయుటానికి అయిదేండ్లుగా జరిగిన ప్రయత్నాలు ఫలించినవి. ఆహారకొరత తీరిపోయినది.

కట్టు బట్టకూడా దేశంలో పుష్కలంగా వున్నది. ప్రత్తి కొరతవల్ల ఏర్పడిన ప్రమాదస్థితి చాలావరకు తొలగిపోయినది. తయారవుతున్న బట్టకు విడుదల లేదు. ధరలు కూడా క్రమంగా తగ్గుతున్నవి. ఇక గృహవసతి సమస్యా పరిష్కారానికి దేశమంతటా తీవ్రకృషి జరుగుచున్నది. మరొక అయిదు సంవత్సరాలలో, ప్రతి ఒక్కరికి ఉండేందుకు ఇల్లు ఏర్పడకపోయినా, ఈ సమస్య తీవ్రత చాలావరకు తగ్గిపోవచ్చును. సహకార సంఘాల ద్వారా సాగుతున్న గృహనిర్మాణకృషి లోపరహితంగా లేకపోయినా, సహకారసంఘాల నిర్వాహకులు లోపాలను గ్రహిస్తున్నందువల్ల భవిష్యత్తు కొంత ఆశావహంగానే వున్నది.

ప్రధానమైన తిండి, బట్ట, ఇల్లు సమస్యలు దాదాపు పరిష్కారమైనా దేశంలో రోజురోజుకూ అధికమౌతున్న నిరుద్యోగుల సంఖ్య ప్రజలకు, పాలకులకు ఆందోళన కలిగించుచున్నది. తక్షణం పరిష్కారం కావలసిన ముఖ్య సమస్యలలో నిరుద్యోగసమస్య ప్రధానమైనదిగా పరిణమించింది. ప్రభుత్వం సకాలంలోనే ఈ సమస్య తీవ్రతను, ఈ సమస్య తక్షణ పరిష్కారావశ్యకతను గ్రహించినందున, పరిష్కారానికి ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నందున ప్రస్తుతం పరిస్థితులు అదుపులో వున్నవి.

గడచిన ఏడేండ్లలో వలెనే రేపుకూడా దేశమంతటా స్వాతంత్ర్య దినోత్సవాలను ప్రజలు, అధికారులు మహావైభవంగా జరుపుతారు. గత ఏడేండ్లలోనూ, ముఖ్యంగా క్రిందటి సంవత్సరం ప్రభుత్వాలు సాధించిన విజయాలపై సమీక్షలు ఎక్కువగా జరుగుతవి. చేయవలసియున్న వాట్ని గురించి గాక చేసివేసిన వాట్ని గురించి ప్రజాప్రతినిధులు, ప్రభుత్వాధికారులు ప్రసంగాలు చేయడం ఈ ఏడేండ్లుగా జరుగుతూ వున్నది. ప్రజలు జరుగవలసి వున్న వాటిమీదనే దృష్టి నిలగ్నం చేయడం, అధికారులు జరిగిపోయిన వాటిపైనే మనస్సు నుంచడంవల్ల ఉభయత్రా కొంత అసంతృప్తి ఏర్పడుతున్నది.

ఒక్క ఏడాదిలో చేయగల పని బహుల్పం. ఒక ప్రాజెక్టు నిర్మాణావకాశాల పరిశీలనకే అధికారులు రెండేండ్లు, మూడేండ్లు తీసుకుంటున్నారు. ఒక ప్రధానసమస్యపై నిర్ణయానికి రావడానికే ఒక ఏడాది పడుతున్నది. కనుక 1953 అగస్టు 15 నుంచి 1954 అగస్టు 15 వరకూ జరిగిన పని ఏమిటని విచారించితే ఏమీ లేకపోవచ్చును. స్వాతంత్ర్యం సిద్ధించిన నాటినుంచి నేటివరకూ జరిగిన పనులేమిటి అంటే. ఆ ప్రశ్నకు దేశవర్తమానస్థితి ఇవ్వగల సమాధానం అందరికీ సంతృప్తికరంగానే వుండగలదు.

స్వాతంత్ర్య వార్షికోత్సవ సందర్భంలో పూర్తి అయిన ఏడాది కృషిని విచారించుకొని ప్రారంభం కానున్న సంవత్సరంలో జరుగవలసిన కృషిని ఆలోచించుకోవడం అవసరం. 1954 ఆగస్టు 15న ప్రారంభమై 1955 అగస్టు 15 తో అంతమయ్యే సంవత్సరంలో ఏ పనులను ప్రారంభించేదీ, ప్రారంభించిన పనులలో వేటిని పూర్తిచేసేదీ ప్రభుత్వ ప్రతినిధులు ఖచ్చితంగా చెప్పకలిగి వుంటే ఆ కార్యక్రమాన్ని పూర్తిచేయడంలో ప్రభుత్వానికి ప్రజాసహకారం పుష్కలంగా లభించగలదు.

ఎప్పటివలెనే ఈ సంవత్సరం కూడా భారత ప్రభుత్వం అంతర్జాతీయరంగంలో ఘనవిజయాలను సాధించింది. ఇండో-చైనా యుద్ధ విరమణ చాలావరకు భారత ప్రభుత్వ కృషిఫలితమే అని చెప్పవచ్చును. భారత ప్రభుత్వ విదేశాంగ విధానం ప్రాశస్త్యం మరొకసారి అఖిల ప్రపంచానికి వెల్లడి అయినది. శాంతిసాధనే భారత ప్రభుత్వ లక్ష్యమని మరొకసారి ఋజువైనది.

జాతీయ రంగంలో భారత ప్రభుత్వం సాధించిన విజయాలు అంత ఘనంగా కన్పించవు. భారతదేశంలోని ఫ్రెంచి స్థావరాల సమస్య పరిష్కారమౌతున్నందుకు సంతోషించవలసిందేగాని పోర్చుగీసు స్థావరాలలో క్షణక్షణం విషమిస్తున్న పరిస్థితులకు ఆందోళన చెందవలసియున్నది. అలాగే భాక్రా నంగల్ ప్రాజెక్టునుంచి సాగుకు నీరు లభించినందుకు సంతోషించవలసిన సమయంలో బీహారు, అస్సాం, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల్లో వచ్చిన వరదలవల్ల ఏర్పడిన విషాద పరిస్థితికి విచారించవలసి యున్నది. లక్షలాది ప్రజలు నిరాశ్రయులైనారు.

ఇక ఆంధ్ర రాష్ట్రంలో పరిస్థితులు యథాతథంగా వున్నవి. అనేక ప్రాజెక్టులకు శంకుస్థాపనోత్సవాలు మాత్రం జరిగినవి. ప్రధానమైన ప్రాజెక్టుల విషయంలో ఇప్పటికి పరిశీలనే పూర్తికాలేదు. శ్రీ వెంకటేశ్వర విశ్వకళాపరిషత్తు ఇంకనూ ఏర్పడవలసియున్నది. కార్యాచరణలో కాలహరణం ఎక్కువగా నున్నది. బలంలేని సంకల్పంవల్ల, సంకల్పసిద్ధికి అంతరాయాలు అధికమౌతున్నవి. అయితే ఈ సంవత్సరం నవరాష్ట్రంలో ఎన్నో నిర్మాణాలకు ప్రారంభోత్సవాలు జరిగినవి. ఈ కార్యక్రమాలన్నింట్నీ సత్వరంగా, విలంబం లేకుండా పూర్తిచేయడానికి రేపు ఆంధ్రులందరూ కంకణధారులు కావలసియున్నది. ప్రారంభించిన కార్యక్రమాలను పూర్తిచేయడంతోబాటు అత్యవసరమైన కార్యక్రమాలను ప్రారంభించడానికి కూడా ఆయత్తం కావాలి.

## పెట్రోవ్‌తో ఆస్ట్రేలియా ప్రధాని లాలూచీ

### హెర్బర్ట్ ఇవాట్ ఆరోపణ

కాంబెర్రా, అగస్టు 12: రాజకీయమైన లాభాలకోసం ఆస్ట్రేలియా ప్రధాని రాబర్టు మెంజిస్ రష్యన్ గూఢచారి లాడ్‌మిర్ పెట్రోవ్ లాలూచీపడి వ్యవహారాన్ని నడిపినట్లు ఆస్ట్రేలియా కార్మికపక్షం నాయకుడు హెర్బర్టు ఇవాట్ నేడు బహిరంగంగా ఒక ఆరోపణ చేశారు.

మెంజిస్ ప్రభుత్వం పెట్రోవ్‌కు ఇందుకుగాను 5 వేల పౌనులు (74 వేల రూపాయలు) ఇచ్చిందని, ఈ డబ్బును ఇచ్చి ఎన్నికల్లో ప్రజలను తప్పుదారుల్లో పెట్టి కొన్ని పత్రాలను ఆయన దగ్గరనుంచి తీసికొన్నదని గూడా ఇవాట్ ఆరోపించారు.

ఈ ఆరోపణలను ఇవాట్ పార్లమెంటులో గాక బయటచేశారు. పార్లమెంటులో స్పీకరు అయన్ను ఈ మాటలు చెప్పనియ్యలేదు.

ఇవాట్ ఈ ఆరోపణలకు ప్రధాని మెంజిస్ పార్లమెంటులో జవాబు ఇచ్చారు. ఈ ఆరోపణలు పిచ్చిగా వున్నాయని, తప్పుడుభావాలుగా వున్నాయని ఆయన పార్లమెంటు సభ్యుల ప్రశ్నలకు సమాధానం ఇస్తూ అన్నారు.

పెట్రోవ్‌కు ఏప్రిల్ 13వ తేదీ నాడు ప్రభుత్వం డబ్బు ఇచ్చినట్లు తనకు అప్పుడు తెలియదని, అందువల్ల ఆ విషయాన్ని తాను పార్లమెంటులో చెప్పలేదని ఆయన అన్నారు.

## కార్మిక వివాదాలపై అప్పీళ్ల సౌకర్యం

### దక్షిణాపథానికి ప్రత్యేకశాఖ ఏర్పడే సూచన

బెంగుళూరు, అగస్టు 11: భారత ప్రభుత్వం కారు లేబరు ఎప్పిలేట్ ట్రిబ్యునల్ ఉపశాఖను ఒకదాన్ని దక్షిణదేశంలో తగిన ప్రదేశంలో ఏర్పాటు చేయుటానికి ఆలోచిస్తున్నారు.

ఇట్లు తాము ఆలోచిస్తున్నట్లు భారత కార్మికశాఖవారు మైసూరు వాణిజ్యమండలివారికి వ్రాసిన ఒక లేఖలో వెల్లడిచేశారు.

ప్రస్తుతం తగాదాలలో అప్పీళ్లకు పోవలసివుంటే దక్షిణ రాష్ట్రాలలోని వారు లక్నోకుగాని, కలకత్తాకుగాని పంపవలసి వస్తున్నది. అందువల్ల వ్యయప్రయాసలు అధికం అవుతున్నాయి. అందువల్ల యీ వాణిజ్యమండలివారు దక్షిణాదిని, ఈ ప్రాంతపు రాష్ట్రాలకు అందుబాటులో వుండే ప్రదేశంలో ట్రిబ్యునల్ శాఖను ఒకదాన్ని నెలకొల్పవలసిందిగా ప్రభుత్వాన్ని అర్థించివున్నారు. ఆ అభ్యర్థనకు యీ ప్రత్యుత్తరం వచ్చింది.

## సూయజ్ ప్రాంత బ్రిటిష్ సేనలు

పోర్ట్‌సయిద్, అగస్టు 11. ఆంగ్లో-ఈజిప్షియన్ ఒప్పందాన్ని అనుసరించి బ్రిటిషువారు అప్పుడే 300 మంది తమ సైనికులను సూయజ్ ప్రాంతంనుంచి నేడు ఇంటికి పంపించివేశారు. ఈ ప్రాంతంనుంచి ఈ సేనల నిష్క్రమణకు ఇదే ఆరంభదార్యంగా అని భావింపబడు తున్నది.

# ఆంధ్రకు పంచవర్ష ప్రణాళిక

1953 అక్టోబరు 1వ తేదీన ఆంధ్రరాష్ట్రం అవతరించడంతో నే రాష్ట్ర పంచవర్ష ప్రణాళికకూడా దానితోపాటే సిద్ధమైనది. ఈ ప్రణాళికలో ఏకోన్నత స్కీములు మినహా మిగతావన్నీ ఉమ్మడిమద్రాసు రాష్ట్రపు పంచవర్ష ప్రణాళికలోనివే.

ఉమ్మడి ప్రణాళిక ఖర్చు రు. 141 కోట్లు. రాష్ట్రవిభజనలో ఆంధ్ర, మద్రాసు, మైసూరు ప్రాంతాలకు విడివిడిగా ప్రణాళికకూడా విభజింపబడింది. ఆంధ్రకు నిర్ధారించిన ప్రణాళికాభాగపు ఖర్చు రు. 51.38 కోట్లు. ఇందులో రు. 27.16 కోట్లు ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి మున్నగు వాటికి ఖర్చుచేయాల్సి వున్నది. మిగతా రు. 24.22 కోట్లు వ్యవసాయాభివృద్ధి, మత్స్యపరిశ్రమ, పశుపోషణ, ప్రజారోగ్యం, విద్య, రోడ్లు, సంక్షేమాలు, బావులు, ట్రాక్టర్లసరఫరా, మున్నగువాటికై నిర్దేశింపబడినది.

### ప్రణాళిక వివరణ

వైద్యం, మత్స్యపరిశ్రమ మున్నగువాటి విషయమై ఆంధ్రకు సంబంధించినంతవరకు కొన్ని స్కీములు ఉమ్మడి రాష్ట్రంలో కాయిదా చేయబడటమో ఆర్థిక స్థితివృష్ట్యా వెనక్కి పెట్టటమో జరిగింది. ఉమ్మడిరాష్ట్రంలో అమలు జరుగుచున్న స్కీములు ప్రస్తుత ఆంధ్ర రాష్ట్రంలో కొనసాగించబడుచున్నవి. నూతనరాష్ట్రం ప్రత్యేక అవసరాల దృష్ట్యా ప్రణాళిక సవరణ కూడా ప్రారంభించాము.

రాష్ట్రం ఏర్పడగానే రాష్ట్ర ఆర్థికస్థితి గురించి భారత ప్రభుత్వానికి స్పష్టం చేయబడింది. వరద బాధితులకు సహాయం, రాష్ట్రానికి అవసరముకు పెట్టుబడి మున్నగువాటి నిమిత్తం కాశ్వత సహాయం కావాలని కూడా కోరడమైనది.

1953-54 ద్వితీయ అర్ధ సంవత్సరంలో కేంద్రం ఆంధ్రకు రూ. 875 లక్షలు అప్పు రూపేణా సహాయమిచ్చింది. 1954-55 కు ఇంకొక రు 700 లక్షలు వాగ్దానం కూడ యిచ్చారు. నీటి తీరువ హెచ్చింపు, వాణిజ్య పంటలపై పన్నుల హెచ్చింపు, అభివృద్ధి పన్ను విధింపు ద్వారా 1 కోటి రూ. లు సేకరించి లోటు పూర్తిచేయ నిశ్చయించాం. ఇంకొంలోటు వుండనే వుంటుంది. అయితే ప్రస్తుత సంవత్సరానికి ముగింపు నిల్వ రు 2 కోట్లు వుండగలదని భావిస్తున్నాము. కనుక 1954-55 లో లోటు పూర్తిచేయడానికి కష్టమంతగా వుండకపోవచ్చు.

### ప్రణాళిక విస్తృత పరచుట

1953 జూలైలో ప్లానింగు కమిషన్ సూచన ప్రకారం, విద్యావంతులైన నిరుద్యోగులకు జీవనోపాధి కల్పించే నిమిత్తం దిగువచర్యలు తీసుకోవాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది.

రాష్ట్ర పంచవర్ష ప్రణాళికలో ప్రస్తుతమున్న స్కీములు ఆర్థికస్థితి లెక్క చేయకుండా కొనసాగించడంకు అఖిలభారత ప్రణాళిక ప్రకారం రాష్ట్రానికిచ్చిన కేంద్ర సహాయం వినియోగించుటు, చేనేత పరిశ్రమను ప్రోత్సాహపరచి సుస్థిరం చేయుట మున్నగునవి.

పవరు ప్రాజెక్టుల క్రింద అయ్యే ఖర్చును రూ. 7.48 కోట్లకు పెంచబడుతుంది. అలాగే ఇరిగేషన్, ప్రజారోగ్యం, వెనుకబడిన తరగతుల స్థితిగతుల అభివృద్ధికింద కూడ అదనపు అవకాశం కలిగించాలని వుద్దేశిస్తున్నాము.

ఇంతేగాక, తుంగభద్ర ఎగువ కాల్వ, గండికోట, వంశధార, నందికొండ, సిద్ధేశ్వరం, ప్రాజెక్టులుకూడ ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చేర్చాలని సిఫార్సుచేశాము. వీటన్నిటవలన జీవనోపాధి కల్పించబడగలదు.

### కార్యక్రమం విస్తరణ

చేనేత, సంఘ, విద్యా కార్యక్రమాలు విస్తృతపరచుట, ఒక ఉపాధ్యాయ పాఠశాల, స్పెషల్ మైనరు ఇరిగేషన్ జాతీయ మలేరియా నివారణస్కీము, స్థానిక సంస్థలకు అప్పులు, మున్నగు అంశాలక్రింద ఆర్థిక సహాయానికై కేంద్రాన్ని రాష్ట్రప్రభుత్వం కోరింది.

భారత ప్రభుత్వంవారు 12 కొత్త మధ్య, చిన్నతరహా ఇరిగేషన్ స్కీములను ఆమోదించి, రూ. 5 కోట్లు మంజూరు చేశారు. 10 అదనపు కోట్లు పనులకు సహాయ గ్రాంటుగా 1 కోటి రూపాయలవరకు కేటాయించింది.

ఇంకా ప్రణాళికా స్వరూపం విషయమై చివరి నిర్ణయం జరక్కపోయినా, మొత్తం సుమారు 76 కోట్లు ఖర్చు కాగలదు.

### ప్రణాళిక ఐఖివృద్ధి

అప్పటికే సంకల్పించిన 8 పంటలు గడిచినవి. 1953 సెప్టెంబరు వరకు అయిన ఖర్చు రు 2983.22 లక్షలు.

ఉమ్మడిరాష్ట్రంలో కాయిదా చేసిన స్కీములు అమలుకు చర్యలు గైకొనబడుచున్నవి. పైగా అమలులో వున్న స్కీములు త్వరితగతిని అమలు జరుపుచున్నవి. కృష్ణారోడ్డు వంతెన పని ప్రారంభమైనది.

### ఇరిగేషన్ ప్రాజెక్టులు

తుంగభద్ర ప్రాజెక్టు, రొంపేరు మురుగు స్కీము, రాళ్లపాడు ప్రాజెక్టు వైరవానితిప్ప, ఎగువ పెన్నారు

## శ్రీ డి. సంజీవయ్యగారు ప్లానింగు మంత్రి

ప్రాజెక్టులపై పని సంతృప్తికరంగా సాగుచున్నది.

తుంగభద్ర వలన పత్తికొండ, ఆలూరు, కొలూకోల్లో 157924 ఎకరాలు సాగులోకి రాగలవు. డాము నిర్మాణం ఇంచుమించు పూర్తియైనది. మొత్తం ఖర్చు (మైసూరు వాటాతో) సహా రు 28.19 కోట్లు.

రొంపేరు మురుగు స్కీమువలన 10 వేల ఎకరాలు అదనంగా సాగవుతుంది. రాళ్ళపాడు ప్రాజెక్టు ద్వితీయ భాగానికయ్యే ఖర్చు రు 50 లక్షలు. దీనివలన అదనంగా 2826 ఎకరాలు సాగవుతుంది.

ఎగువ పెన్నారు ప్రాజెక్టు వలన 8 వేల టన్నుల బియ్యం అదనంగా లభిస్తవి. వైరవానితిప్ప ప్రాజెక్టువలన 8 వేల ఎకరాలకు లాభిస్తుంది. దీని ఖర్చు రు 102 లక్షలు.

### పవర్ ప్రాజెక్టులు

మాచ్‌ఖండు హైడ్రో ధర్మల్ స్కీము ఒరిస్సా ఆంధ్ర ప్రభుత్వాల సంయుక్త ఆధ్వర్యాన జరుగుచున్నది. పెట్టుబడి ఖర్చు, వుత్పత్తి అయిన విద్యుచ్ఛక్తి 70: 30 నిష్పత్తిలో ఆంధ్ర, ఒరిస్సాల మధ్య విభాగించబడింది.

తుంగభద్ర హైడ్రోథర్మల్ స్కీము ఖర్చు రు 457 లక్షలు, దీనివలన క్రొత్త పవర్ ట్రాన్స్‌మిషన్ నిర్మాణం జరుగుతుంది.

తుంగభద్ర సమిష్టి పనుల క్రింద అయ్యేఖర్చు రు 506 లక్షలు, ఆంధ్ర వాటా ఇందులో రు 404 లక్షలు 80: 20 నిష్పత్తిలో ఫలితాలను ఆంధ్ర మైసూరులు పంచుకొంటాయి.

### రహదార్లు

ఆంధ్రలో రోడ్లకు సంబంధించిన ఖర్చు రు 248.36 లక్షలు 10 అదనపు రోడ్డుపనులను కేంద్రం ఆమోదించింది

### సమాజ వికాస కేంద్రాలు

కాకినాడ - పెద్దాపురం, కడప-కర్నూలు ప్రాంతాల్లో రెండు సమాజ వికాస కేంద్రాలు 1952 అక్టోబరులో ప్రారంభించ బడినవి. వాయల్పాడు, ఇచ్ఛాపురంలలో అదనపు బ్లాకులను ప్రభుత్వం ప్రారంభించింది. ప్రతి బ్లాకుకయ్యే ఖర్చు రు 15 లక్షలు.

1953-54లో 22 జాతీయ వికాస విస్తరణ కేంద్రాలు ప్రారంభించబడినవి. ప్రతి బ్లాకుకయ్యే సరాసరి ఖర్చు 7½ లక్షలు.

స్థానిక అభివృద్ధి పనుల క్రింద భారత ప్రభుత్వంవారు ఆంధ్రకు రు 14,75,200 లు 1953-54లో కేటాయించారు.

రాష్ట్ర ప్రభుత్వం ఒక సాంఘిక సంక్షేమ సలహా సంఘం స్థాపించింది. 17 సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులపై పర్యవేక్షణ జరపడం యీ సంఘం ప్రధాన కర్తవ్యం. ఈ 17 కేంద్రాలు 1954 అగస్టు 15న ప్రారంభింపబడు చున్నవి.

# నవభారత నిర్మాణానికి భారతసేవకసమాజ్ కృషి

[శ్రీ కృష్ణప్రసాద్]

రెండు సంవత్సరాల క్రితం భారత్ సేవక్ సమాజ్ స్థాపించబడింది. నవభారత్ నిర్మాణాన్ని గురించి మనం ఇంతకాలంగా కంటున్న బంగారు కలలు సార్థక్యం కోసరము నిర్విరామ కృషిని సాగించాలని భారత ప్రజల ఆకాంక్ష ఫలితంగా ఆవిర్భవించిన మహత్తర సంస్థ ఇది. మెట్టుమెట్టుగా నవభారత నిర్మాణం జరగాలని ప్రధాని నెహ్రూ ఒక ప్రసంగంలో ఉద్బోధించారు. భారత దేశంలో ప్రతివారు తమ వంతు కృషిని తాము మనస్ఫూర్తిగా సాగించి ఈ మహోజ్జ్వల నిర్మాణంలో తోడ్పడవలసిందని భారత్ సేవక్ సమాజ్ అర్థిస్తున్నది.

భారత దేశంలో సహజ సంపదలను సక్రమంగా సద్వినియోగం చేసి ప్రజలలో గల ఆర్థికఅసమానత్వాన్ని రూపుమాపి, వారి జీవన ప్రమాణాన్ని పెంపొందించడానికి తొలిసారిగా జరుగుతున్న ప్రయత్నమే పంచవర్ష ప్రణాళిక. ప్రజల హృదయపూర్వక సహకారమే ప్రణాళికాసాఫల్యానికి పట్టుకొమ్మ. ప్రజల సహకారముంటే కొండలను పిండిచేయవచ్చు. ప్రజలలో శారీరశక్తిని పెంపొందించి, వారిలో గల మత రాజకీయ విభేదాలను విస్మరింప చేసి దేశసేవాసక్తిని రేకెత్తించడమే భారత్ సేవక్ సమాజ్ ప్రధాన లక్ష్యము.

అయితే ఈ సంస్థ తన లక్ష్యములన్నింటిని ఇప్పటికే సాధించ కలిగిందని చెప్పడం దుస్సాహసమే అవుతుంది కాని, ఈ నాడు దేశవ్యాప్తంగా అమలు జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో ప్రజల స్వయం సహాయ దృక్పథాన్ని పెంపొందించడంలో భారత్ సేవక్ సమాజ్ కృషి తక్కువేమీ కాదు. పల్లెల్లో పేటలలో పొలాల్లో కర్మాగారాలలో ప్రతిచోట భారత్ సేవక్ సమాజ్ సాగిస్తున్న అవిరత కృషి ఫలితంగా స్వయం సహాయ మూలంగా పట్టుబట్టిన ప్రజలుమహోత్కృష్టలక్ష్య సాధనకు నడుములు బిగించి ముందుకు వస్తున్నారు. భారత్ సేవక్ సమాజ్ విధానాలు ప్రతిప్రాంతానికి వేరువేరుగా, ఉన్నప్పటికి ప్రతిచోట శ్రమదానలక్ష్య ప్రబోధానికే ప్రాధాన్యం ఇవ్వబడుతున్నది. ఈ సందర్భంలో మురికి గూడేములు పరిశుభ్ర పరచబడుతున్నాయి.

గ్రామాలకు రోడ్లు వేయబడుతున్నాయి. పాఠశాలలకు, ఆస్పత్రులకు భవనాలు, పంచాయితి గృహాలు నిర్మించబడుతున్నాయి. పంట కాల్వలు, బోదెలు మురుగుకాల్వలు త్రవ్వబడుతున్నాయి వాటిల్లో పేరుకుపోయిన పంద్రుడు తొలగించబడుతున్నవి. అవి లోతు చేయబడుతున్నాయి. సాంఘికవిద్య వ్యాప్తికి ప్రజలకు గరుపబడుతున్నది.

(8 వ పేజీ చూడుడు)

# మద్రాసురాష్ట్రంలో అభివృద్ధి కార్యక్రమాలు

## సప్తమ సంవత్సర సమీక్ష

స్వాతంత్ర్యానంతర సప్తమవర్షం అనావృష్టికి, అగచాట్లకీ స్వస్తి చెప్పింది. సంపత్సమృద్ధికి అభ్యున్నతికి నాంది పలికింది.

యుద్ధానంతరం, ఈశాన్య, నైరృతి ఋతుపవనాలు వీచిన తొలిపాలు ఇదే.

కొన్ని ప్రాంతాలలో పంట తెగుళ్ల వల్ల కొంత నష్టం వాటిల్లినా, మొత్తం మీద ఈ ఏటి సస్యఫలం తృప్తికరంగానే ఉంది.

ఈ సంవత్సరపు ఘనసంఘటన—1953 అక్టోబరు ఒకటవ తేదీన మదరాసు రాష్ట్రవిభజన ఆంధ్రరాష్ట్ర అవతరణ.

ఇక, రాజకీయంగా మద్రాసు మంత్రివర్గం మారింది. ఆరోగ్య కారణాల దృష్ట్యా ముఖ్యమంత్రి చక్రవర్తుల రాజగోపాలాచారిగారు 1953 ఏప్రిల్ 13వ తేదీన రాజీనామా చేశారు. ఆయన సారథ్యసామర్థ్యంవల్ల రాష్ట్రం అనేక క్లిష్టపరిస్థితులను దాటి, ఆహారాది రంగాలలో అభ్యుదయపరంగా పురోగమించింది. ముఖ్యంగా, ముఖ్యంగా ఆహారధాన్యాలపై కంట్రోళ్ళను తెగింపులో పూర్తిగా తొలగించిన తొలిరాష్ట్రం ఇదే.

ఏప్రిల్ 13వ రాజగోపాలాచారిగారు, ఆయన పంచదశ మంత్రిమండలీ రాజీనామా ఇవ్వగానే, శ్రీ కె. కామరాజనాడారుగారు ముఖ్యమంత్రిగా రాష్ట్రసారథ్య బాధ్యత వహించారు. శ్రీ కామరాజ్ ప్రభుత్వం కాంగ్రెసుతోపాటు, ప్రతిపక్షాల మన్ననలకు కూడా పాత్రమైంది.

ప్రస్తుత మద్రాసురాష్ట్ర వైశాల్యం 3 కోట్ల 33 లక్షల ఎకరాలు. జనాభా 1951 లెక్కల ప్రకారం-3 కోట్ల 57 లక్షలు.

మద్రాసురాష్ట్రం విభజింపబడినా, ప్రస్తుత మద్రాసురాష్ట్రంలోని సంక్షేమ నిర్మాణాత్మక కార్యక్రమాలు కుంటుపడకుండా, చక్కగా సాగుతున్నాయి.

వివిధ రంగాలలో సాగించబడుతూ వచ్చిన కార్యక్రమాల వివరాలు యీ క్రింద పొందుపరచబడింది.

### పంచవర్ష ప్రణాళిక

రాష్ట్ర విభజనానంతరం, అవశిష్ట రాష్ట్రానికి నిర్దేశించిన పంచవర్ష ప్రణాళికనుండి మద్రాసురాష్ట్రానికి 93 కోట్ల రూపాయలు వాటా లభించింది. 1951-52 నుండి 5 సంవత్సరాల కార్యక్రమాలకు ఈ సొమ్ము వినియోగించబడుతుంది. ప్రథమస్థానం నీటిపారుదల విద్యుచ్ఛక్తి పథకాలకు ఇవ్వబడింది. వీటికై 50 కోట్ల రూ॥ కేటాయించబడింది. పోతే, వ్యవసాయం, కమ్యూనిటీ ప్రాజెక్టులూ, జాతీయ విస్తరణ కార్యక్రమాలూ, మత్స్యపరిశ్రమ మొదలైనవాటికి రు. 13 కోట్లూ, విద్య వైద్యం, ఆరోగ్యం హరిజనోద్ధరణలకు 19 కోట్లూ మిగతా 5 కోట్లూ సహకారం పరిశ్రమలూ, రోడ్లూ మొదలయిన వాటికి కేటాయించబడ్డాయి తృతీయ సంవత్సరాంతానికి పంచవర్ష ప్రణాళిక ధనంలో 40 కోట్ల వ్యయం ప్రాప్తిపై గుంది అంటే, సాలీనా సగటున 15 కోట్ల రూపాయలు.

### నీటిపారుదల

రాష్ట్రంలోని ప్రాజెక్టు లన్నిటికన్న పెద్దది దిగువ భవానీప్రాజెక్టు. దీని నిర్మాణవ్యయం 9.96 కోట్లు అవుతుంది. ఇది పూర్తికావస్తున్నది. మలబారులోని మలంపూజా, తిరునెల్వేలిలోని మణిముత్తారు, పెట్టూరు కాల్వలపథకం యీ సంవత్సరాంతానికి పూర్తికాగలవు. ఇక అరణియార్, వాలయార్, మంగళం, అమరావతి రిజర్వాయరు ప్రాజెక్టు నిర్మాణం వివిధ దశలలో వుంది. సాతనూర్, కృష్ణగిరి ప్రాజెక్టులు తొలిప్రణాళికలో చేర్చబడ్డవి. పోతే, చెరువులమరమ్మతు మొదలైన చిల్లర కార్యక్రమాలకు 94 లక్షలు కేటాయించబడింది.

### వ్యవసాయం

పైన పేర్కొన్న ప్రాజెక్టుల వల్ల వేలకొద్దీఎకరాల భూమి సాగుకు వచ్చింది. అనుకూల వర్షపవనాల వల్లా వ్యవసాయంలో కొత్తవిధానాలు అనుసరించినందువల్లా మొత్తంమీదఎక్కువ భూమిలో ధాన్యం పండించబడింది. తత్ఫలితంగా ఉత్పత్తి హెచ్చింది. ఈ యేడు 12,893 ఎకరాలలో జపాను వరిసాగుపద్ధతి అమలు జరిగింది. దీనివల్ల ఉత్పత్తి హెచ్చుదల 22%నుండి 58% వరకూ కనపడింది.

### పశుసంరక్షణ

పశువుల అభివృద్ధికి సంరక్షణకూ మూడురకాల పథకాలు రూపొందించబడ్డాయి. 1 పాలిచ్చని ఎంబోతులను గోవధాలు పెలకొల్పడం. 2. ఎనభ శ్యాలుఉడిగిన ముసలిఆవులకుగోశాలలు నిర్మించడం. 3. 'కీలక గ్రామాలు' ఏర్పాటుచెయ్యడం. యీప్రాంతంలో విపరీతంగా వ్యాపించిన పశువు 'తెగులు' ని పూర్తిగా నిర్మూలించడం జరిగింది. ఇదివరకు సాలీనా దీనివల్ల దరిదాపు 20 వేల పశువులు చనిపోయేవి.

### అడవులు

అడవుల పంచాయతీలపాలనక్రిందా జమీందారీల క్రిందా వున్న అడవులను ప్రభుత్వం స్వాధీన పరచుకుంది. వాటి సంరక్షణకూ, అభివృద్ధికీ చర్యలు తీసుకుంది. అడవుల వల్ల ఈ ఏడు వసూలైన శిస్తు 53 లక్షల రూపాయలు.

### మత్స్య పరిశ్రమ

చేపల ఉత్పత్తి పెరుగుదలకు తగ్గ ఆర్థిక పరిస్థితులు చక్కబెట్టడం, కొనుగోలు దారులకు చేపలు సముచిత ధరలకు లభించే ఏర్పాట్లు చేయడం మొదలైన కార్యకలాపాలు చక్కగా నిర్వహించబడు తున్నవి. తంజావూరు జిల్లాలో ప్రయోగాత్మకమైన ఒక క్రొత్త పథకం అమలు జరుపుతున్నారు. దీని ప్రకారం వరి పొలాలలోనే చేపల పెంపకం కూడా సాగించబడుతుంది. దీనివల్ల లబ్ధి చేకూర్చగలదు.

### గ్రామ సంక్షేమ కార్యక్రమాలు

1953 అక్టోబరు 2వ తేదీన రాష్ట్రంలో 28 స్థానాలలో జాతీయ విస్తరణ కార్యక్రమాలు ప్రారంభించబడ్డాయి. ఒక్కొక్క స్థానమునకు 3 సంవత్సరాలలో 7½ లక్షల రూపాయల వ్యయం అవుతుంది.



కమ్యూనిటీ ప్రాజెక్టులు

రాష్ట్రంలోని 4 ప్రాజెక్టు ప్రాంతాలలో కమ్యూనిటీ ప్రాజెక్టు కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి. వ్యవసాయం, పశుపోషణ, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, గ్రామ పారిశుద్ధ్యం మొదలైన గ్రామ సంక్షేమ కార్యక్రమాలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ కార్యక్రమాలకు ఇంతవరకూ 19½ లక్షలు ఖర్చయింది. ఇందులో ప్రజలు భరించినవాటా-ధన, రూపేణాగాని, కాయకష్టంరూపేణా గాని - 8,79 లక్షలు.

### హరిజన సంక్షేమం

హరిజనోద్ధరణ విషయమై మద్రాసు ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించి గట్టిగా కృషిచేస్తున్నది. హరిజన సంక్షేమ కార్యక్రమాలకు ప్రత్యేకంగా కోటి రూపాయలు కేటాయించబడాయి. అస్పృశ్యతా నివారణకు, ముఖ్యంగా గ్రామప్రాంతాలలో యీ భేదం తొలగించడానికి విరివిగా ప్రచారంసాగించే నిమిత్తం కేంద్రప్రభుత్వం 1,99,000 రూ॥లు మద్రాసుకు మంజూరుచేసింది. గత ఐదుసంవత్సరాలలోనూ హరిజనోద్ధరణ కార్యక్రమాలకు వ్యయం మూడింతలు పెరిగింది. 1947 లో 41 లక్షల వ్యయం 1952-53 లో 124 లక్షలకు పెరిగింది.

### కార్మిక సంక్షేమం

కార్మికులూ యజమానులకు వచ్చే తగాదాలు వీలైనంతవరకూ వారే పరిష్కరించుకునేటట్టు చేయడం ప్రస్తుత ప్రభుత్వవిధానం. అలా పరిష్కారం కానపక్షంలో, మూడవ పక్షం తీర్పుకై నివేదించడం జరుగుతున్నది. కార్మికుల యోగక్షేమాలదృష్ట్యా, కార్మికశాఖ అనేక కార్మికశాసనాలు అమలుజరుపుతున్నది.

### విద్య

పాఠ్యాన్ని జనానీకానికి కేవలం పుస్తకపరిజ్ఞానం చాలదనీ, వివిధవిషయాలలో శిక్షణ అవసరమనీ ప్రభుత్వం గుర్తించింది. ప్రాథమిక విద్యావిధానంలో యీ అంశానికి అధికప్రాధాన్యత యిచ్చింది. ఎలిమెంటరీ విద్యలో గత సంవత్సరం ప్రవేశపెట్టబడిన నూతన విధానాన్ని 1954 జూన్-1 నుండి ప్రభుత్వం నిలిపివేసింది.

### ప్రజారోగ్యం

యీ రాష్ట్రంలో విజృంభించిన తీవ్రవ్యాధులలో మలేరియా ఒకటి. దీని నివారణకు ప్రభుత్వం 14 పథకాలు అమలుజరుపుతుంది.

గత జూలై నెలలో ప్రభుత్వం మధురలో ఒక వైద్యకళాశాల నెలకొల్పింది. వైద్య విద్యా బోధనాభివృద్ధికి తగు విధానాలు కనుగొనే నిమిత్తం ప్రభుత్వం ఒక కమిటీ నెలకొల్పింది. జనరల్ ఆస్పత్రిలో ఈ ఏటి నుండి సుఖవ్యాధి చికిత్సలో డిప్లమా కోర్సులు ప్రారంభించింది.

### పునరావాసం

మద్రాసునగరంలో యాచకుల బెడద నివారించడానికి అంకైకల్యాణి లోపాలవల్ల కాయకష్టం చేయలేని యాచకులకు అన్నవస్త్రాలిచ్చి కాపాడడానికి ప్రభుత్వం ఒక సంరక్షణ కేంద్రం, ఒక సంరక్షణాశ్రమం నెలకొల్పింది.

### సహకారం

ఈ సంవత్సరం దేశమంతటా సహకారోద్యమ స్వర్ణోత్సవం జరిగింది. మద్రాసు రాష్ట్రంలో సహకారఉద్యమం సర్వతోముఖంగా విస్తరించింది. 1953 డిసెంబరు నెలాఖరుకు రాష్ట్రంలో మొత్తం 18,781 సహకార సంఘాలున్నాయి. వీటి సభ్యులు 28½ లక్షల మంది. రాష్ట్రంలోని చేనేత పరిశ్రమ సహకార విధానంపైనే నిర్వహించబడుతున్నది.

### పరిశ్రమలు

తొండయార్పేటలో ఖాదీ యంత్రాల నిర్మాణానికి ఒక ఫ్యాక్టరీ, తిరునల్వేలిజిల్లాలో కాస్టిక్ సోడా ఫ్యాక్టరీ మద్రాసులో డీసెల్ ఇంజన్ ఫ్యాక్టరీ, తిరువళ్ళి, పలితాలైలలో రెండు చక్కర ఫ్యాక్టరీలూ ప్రభుత్వం నెలకొల్పింది. చిన్నపరిశ్రమాభివృద్ధికి క్రిందటి ఏడు 17 నుండి ప్రమోటర్లకు లైసెన్సులు ఇచ్చింది. గ్రామప్రాంతాలలో పరిశ్రమల అభివృద్ధికి విశ్వేశ్వరయ్యగారు చేసిన పథకం ప్రకారం ఈ ఏడు 28 ప్రదేశ పరిశ్రమలు ప్రారంభించబడ్డాయి.

### విద్యుచ్ఛక్తి

వివిధ ప్రాంతాలలో, ఆయాప్రాంతీయులనుండి వచ్చిన కోరికల ఆధారంగా విద్యుచ్ఛక్తి సరఫరాచేసే పథకం ధనాభావంవల్ల 1952 నవంబరులో ప్రారంభించినా 1953 నవంబరులో రద్దుచేయబడింది. రాష్ట్రంలోని వివిధ విద్యుచ్ఛక్తి కేంద్రాలకు అవసరమైన జలం అనుకూల వర్షపాతంవల్ల సమృద్ధిగా లభించింది. గ్రామప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా కార్యక్రమాలు చురుకుగా సాగుతున్నాయి. జాగ్ విద్యుచ్ఛక్తి కేంద్రంనుండి దక్షిణ కనరాకు సరఫరా చేయడానికిగాను మైసూరు ప్రభుత్వంతో ఒప్పందం జరిగింది.

### రోడ్లు

రోడ్ల అభివృద్ధి, పరిరక్షణల విషయంలో ప్రభుత్వం సముచిత శ్రద్ధవహిస్తూంది. యీ సంవత్సరం 10 లక్షల వ్యయంతో దక్షిణ కనరాలో నేత్రావతి వంతెన, 18½ లక్షల వ్యయంతో మలబారులోని ధరతపూజా వంతెనా నిర్మించబడ్డాయి. చెంగల్‌పట్‌లోని పాలారు వంతెన, కోలరూన్ నదిపై మరొక వంతెన నిర్మాణంలో ఉన్నాయి. కోలరూన్ వంతెన ప్రపంచంలోని వంతెనలన్నిటికన్న పొడవైనదిగా నిర్మించబడుతుంది. దీనినిర్మాణ వ్యయం 28½ లక్షలు. మద్రాసు రాష్ట్రపు పశ్చిమకోస్తా రహదారి వృద్ధిచేయడానికి పెద్దపథకం వేయబడింది. దీనికయ్యే వ్యయంలో కేంద్రప్రభుత్వం సగం భరిస్తుంది. ఇక్కడ హైవేస్ పరిశోధన కేంద్రం నెలకొల్పడానికి కూడా కేంద్ర ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. దేశంలో హైవేస్ ఇంజనీరింగులో పరిశోధనలు జరుపడానికి నెలకొల్ప తొలి కేంద్రం ఇదే.

ఆంధ్రపత్రిక • సారస్వతానుబంధం

1954 సం॥ ఆగస్టునెల 14-వ తేదీ, శనివారము



# వాల్మీకి రామాయణం

శ్రీ శ్రీనివాస శిరోమణి

## అయోధ్యా కాండ

౧

భరతుడు మేనమామ ఇంటికి ప్రయాణము అయిపోతూ శత్రుఘ్నుణ్ణి తోడు తీసుకువెళ్ళాడు. శత్రుఘ్నుడు జితేంద్రియుడు. బుద్ధిమంతుడు. ఆ అన్నగారి మీద అతనికి ఉన్న ప్రేమాతిశయమునుంచి గిరివ్రజపురానికి తోడుగా పోయినాడు.

అక్కడ భరతుడి మేనమామ (యుధాజిత్) భరతుణ్ణి శత్రుఘ్నుణ్ణి సొంత కన్న బిడ్డలవలె ఆదరించినాడు. చక్కగా సత్కరించినాడు. వారుకోరుకొన్నవి అన్నీ ఇచ్చి సంతోషపెట్టినాడు. సుఖపెట్టినాడు. అక్కడ ఆ అన్నదమ్ములు అట్లా ఎంతో సంతోషముగానూ సుఖముగానూ ఉంటూ ఉన్నా వృద్ధుడు అయిన తమ తండ్రి దశరథమహారాజును గురించే ఆలోచించసాగినాడు.

దశరథమహారాజున్నూ శోకాంతిములో ఉన్న ఇంద్రవరుణుల వంటి ఆ భరత శత్రుఘ్నులను గురించే ఆలోచించడము మొదలుపెట్టినాడు. ఆయనకు నలుగురు కొడుకులూ నాలుగు చేతులవంటివారు. నలుగురూ ఇష్టులే. అయితే మహావిష్ణువుకు దేవతలు అందరిలోనూ బ్రహ్మదేవుడు అంటే ఎక్కువ ఇష్టము. అదే విధముగా దశరథమహారాజుకు నలుగురు కొడుకులలోనూ రాముడు అంటే ఎక్కువ ఇష్టము.

ఇంతకూ మహావిష్ణువే రాముడు. మహోన్నతుడు అయిన రావణాసురుణ్ణి సంహారము చేయవలసింది అని దేవతలు ప్రార్థిస్తే మానవజన్మను ఎత్తినాడు. అందువల్లనే దేవలోకములో దేవేంద్రుణ్ణి కన్న అదితివలె ఈ మానవలోకములో రాముణ్ణికన్న కౌసల్యాదేవి శోభించింది. అటువంటి అనుపమానము అయిన పుత్రుడు ఈ భూలోకములో ఎవరికీ పుట్టలేదు అని దశరథమహారాజు సంతోషపడ్డాడు.

దశరథమహారాజుకు ఉన్న సద్గుణాలు అన్నిటితోటి రాముడు పుట్టినాడు. అతడు సుందరాకారుడు. పరమపరాక్రమవంతుడు. అసూయలేనివాడు. ఎప్పుడూ ప్రశాంత చిత్తములో ఉండేవాడు. ఎవరు ఎంత పరుషముగా మాట్లాడినా మృదువుగా జవాబు చెప్పేవాడు. ఎవరు ఎందుకు ఏ కొంచెము ఉపకారము చేసినా సంతోషపడేవాడు. నూరు అపకారాలు చేసినా జ్ఞాపకము ఉంచుకొనేవాడు కాడు. ఎడతెగకుండా అస్త్రాభ్యాసము చేస్తూ విరామసమయాలలో శీలవృద్ధులతో సదాచారాలను గురించి వయోవృద్ధులతో పరంపరాగత సత్సంప్రదాయాలను గురించీ జ్ఞానవృద్ధులతో వేదాంత రహస్యాలను గురించీ చర్చించి తెలుసుకొంటూ ఉండేవాడు.

అతడు మహాబుద్ధిమంతుడు. మధురభాషి. ఎవరిని అయినా అతడే ముందుగా పలుకరించేవాడు. సంతోషపెట్టే సంగతులే మాట్లాడేవాడు. అమితవీర్యవంతుడు అయినప్పటికీన్నీ ఎన్నడూ విర్రవీగి ఎరగడు. అబద్ధాలు ఆడేవాడు కాడు. పెద్దలను ఎప్పుడూ గౌరవించేవాడు. ప్రజలను రంజింపచేసేవాడు. ప్రజలున్నూ అతణ్ణి అమితముగా ప్రేమించేవారు. అతడు విద్వాంసుడు. ధర్మజ్ఞుడు. దయాశీలి. కోపాన్ని జయించినాడు. ఎప్పుడూ దృఢనియమముతో ఉండేవాడు. పరిశుద్ధుడు. బ్రాహ్మణులను పూజించేవాడు. దరిద్రులను దయతో చూచేవాడు. ఇక్ష్వాకు వంశోచితము అయిన దయాదాక్షిణ్య శరణాగత రక్షణాదిధర్మాలు అన్నీ అతనిలో మూర్తీభవించినవి. అతడు క్షత్రధర్మమే తనకు ముఖ్యము అయినది అనీ ఆ క్షత్రధర్మానుష్ఠానము వల్లనే యశస్సున్నూ స్వర్గసౌఖ్యమూ తనకు సంప్రాప్తము అవుతవి అనీ నిశ్చయించుకొన్నాడు.

అతడు ఎన్నడూ చెడు విషయాలలోకి - అంటే జూదమూ మొదలు అయిన వ్యసనాలలోకి - మనస్సుపోనిచ్చేవాడు కాడు. ధర్మవిరుద్ధము అయిన గ్రామ్య సంభాషణలకు చోటు ఇచ్చేవాడు కాడు. ఏ విషయములో నయినా బృహస్పతివలె యుక్తిప్రతియుక్తి చెప్పేవాడు. ఎప్పుడూ మంచి దేహదార్ఢ్యములో ఉండేవాడు. అనారోగ్యము ఎన్నడూ ఎరగడు. వాగ్మి. దేశకాల విదుడు. చూచే చూడటములో ఎవటె వారి మనస్సు కనిపెట్టేవాడు. ప్రజలు అందరికీ బహిఃప్రాణము అయినాడు. సాంగముగా వేదాధ్యయనము చేసినాడు. విద్యావ్రతస్నాతుడున్నూ అయినాడు. ఈ లోకములో అతను ఒక్కడే సత్పురుషుడు అనిపించుకొన్నాడు. భుజబలము కొద్దిబాణాలు వదలడములోనూ మంత్రసహితముగా అస్త్రాలను వదలడములోనూ ఇంద్రుడికన్నా గొప్పవాడు అయినాడు. పితృమాతృ వంశాలకు రెంటికిన్నీ కులదీపకుడున్నూ అయినాడు. ఏ దోషమూ లేనివాడు. ఎటువంటి కష్టకాలములోనయినా దిగులు పడేవాడు కాడు. ఆడి తప్పేవాడు కాడు. ఋజువర్తనుడు. ధర్మార్థ దర్శకులు అయిన బ్రాహ్మణుల దగ్గిర సుశిక్షితుడు అయినాడు. ధర్మార్థ కామతత్త్వజ్ఞుడు.

రాముడు మరుపులేనివాడు. అతడి బుద్ధి ఎప్పటికీ అప్పుడు వికసిస్తూ ఉండేది. లౌకిక మర్యాదలూ శిష్టాచారాలూ తెలిసిన పండితుడు. వినయాన్వితుడు. సాభిప్రాయాలవల్ల తన మనో నిశ్చయాన్ని ఇతరులకు తెలియనిచ్చేవాడు కాడు. అతని ఆలోచనలు ఫలప్రాప్తివరకూ ఎవరికీ బోధపడేవి కావు. అతని కోపము కానీ అతని సంతోషము కానీ ఎన్నడూ వ్యర్థము అయిపోయేది కాదు.

అతనిది దృఢము అయిన సదాభక్తి. స్థిరము అయిన ప్రజ్ఞ. దుర్మార్గులను దరిచేరనిచ్చేవాడు కాడు. ఒక్క దుష్టవాక్కు తన నోటి వెంట రానిచ్చేవాడు కాడు. అలసత్వము అనేది అతనికి లేదు. పొరపాటు ఎరగడు. తన దోషము ఏదో ఇట్టే గ్రహించేవాడు. చూడగానే మనుష్యుల తారతమ్యాలను తెలుసుకొనేవాడు. కృతజ్ఞుడు. శాస్త్రజ్ఞుడు. ఎవరిని అయినా చేర తీయడములోనూ ఆ చేరతీసిన వారిని ఆదరించడములోనూ అతి సమర్థుడు. స్నేహము చేయడములోనూ స్నేహము చేసిన పెద్దలను నిలుపుకొనడములోనూ పండితుడు. దుష్టులను నిగ్రహించడములో నిపుణుడు. ధనార్జనోపాయాలు అన్నీ తెలిసినవాడు. శాస్త్రీయముగా వ్యయము చేయడమున్నూ తెలిసినవాడు.

అతడు న్యాయవైశేషిక వేదాంత వ్యాకరణ మీమాంసాది శాస్త్రాలనూ సంస్కృత ప్రాకృతాది మహాభాషలలో కావ్యనాటకాది గ్రంథాలనూ కరతలామలకము చేసుకొన్నాడు. ధర్మలోపమూ అర్థలోపమూ లేకుండా సుఖము అనుభవించేవాడు. అలసుడు కాడు. వినోద ప్రయోజనమూ - సంగీతమూ చిత్రరచనమూ మొదలుఅయిన వినోదాలు అన్నీ తెలిసినవాడు. అర్థవిభాగము- అంటే ధర్మముకోసమూ యశస్సుకోసమూ లౌకిక వ్యవహారముకోసమూ తనకోసమూ తన బంధుమిత్రులకోసమూ ధనాన్ని అయిదుభాగాలు చేసి-వినియోగించడము ఎరిగినవాడు. ఏనుగులనూ గుర్రాలనూ నడపడములోనూ వాటిని శిక్షించడములోనూ సమర్థుడు. ధనుర్వేదవిదులలో శ్రేష్ఠుడు. అతిరథ సమ్మతుడు. శత్రువులు ఎత్తివచ్చేవరకూ ఊరకఉండేవాడు కాడు; అతడే వారికి ఎదురుసంధానించి పోరాడి గెలిచివచ్చేవాడు. సేనలను నడపడములో ఆరితేరినాడు. సురాసురులు ఏకముఅయి ఎత్తివచ్చినా అతణ్ణి ఎదిరించలేరు. అతడు ఇతరులను నెపము ఎన్నేవాడు కాడు. కోపపరవశుడు అయ్యేవాడు కాడు. గర్వపడేవాడు కాడు. ఎవరినీ నిందించేవాడు కాడు. కాలానికి కట్టుబడేవాడు కాడు. మత్సరములేనివాడు. సూర్యుడు తన అనంతకిరణాలతో తేజరిల్లినట్టు ఇటువంటి లోకోత్తరగుణాలతో రాముడు తేజరిల్లినాడు. సర్వప్రజాకాంతుడు అయినాడు. ముల్లోకాలవారికీ పూజ్యుడు అయినాడు. ఆ అప్రధృష్యపరాక్రమవంతుణ్ణి ఆ అశేషకళ్యాణగుణసంపన్నుణ్ణి లోకపాలకులతో సరిసమానము అయిన ఆ రాముణ్ణి భూదేవి తనకు ప్రభువుగా వరించింది.

ఆ మహానుభావుణ్ణి రాముణ్ణి తాను జీవించిఉండగా రాజును చేయడము ఎట్లాగా అని దశరథ మహారాజు ఆలోచించడము మొదలుపెట్టినాడు.

"రాముడు లోకాభివృద్ధికాముడు. దయాసముద్రుడు. ప్రజల సంతాపాన్ని పోగొట్టడములో పర్జన్యుడివంటివాడు. పరాక్రమానికి యమశక్రుల వంటివాడు. బుద్ధికి బృహస్పతివంటివాడు. ధైర్యానికి మేరుపర్వతమువంటివాడు. క్షమాగుణానికి భూమివంటివాడు. ప్రజలు అందరికీ నాకన్నా ఇష్టుడు. వాడు-రాముడు రాజ్యపాలనము చేస్తూఉంటే నేను చూచి సంతోషించి చనిపోతేను" అని దశరథ మహారాజు నిశ్చయించుకొన్నాడు.

ఈ విషయము దశరథ మహారాజు మంత్రులు అందరితోనూ సంప్రదించినాడు. రాత్రిపూట నక్షత్రమండలములోనూ పగటిపూట ఆకాశములోనూ భూమిమీదనూ తనకు ఉత్పాతాలు భయంకరముగా కనబడుతున్నవి అనీ తనకు బాగా వార్ధక్యము వచ్చిందనీ ప్రజాహితముకోసమూ తన సంతోషముకోసమూ సర్వజనసంతోషకారుడూ పూర్ణచంద్రుడివలె సర్వలోకప్రియుడూ అయిన రాముణ్ణి యువరాజును చేయవలెను అని దశరథమహారాజు చెప్పినాడు. అందుకు మంత్రులు అందరూ అంగీకరించినారు.

రాముణ్ణి యువరాజును చేయవలసినకాలము ఆసన్నము అయింది అని దశరథమహారాజు అంతట నిశ్చయించినాడు. ఆ విషయము ఆలోచించి నిర్ణయించడానికి ఒక సభను సమావేశపరచవలెను అనుకొన్నాడు. నానా నగర ముఖ్యులనూ జానపద ముఖ్యులనూ రాజముఖ్యులనూ ప్రత్యేకము ప్రత్యేకముగా ఆహ్వానించినాడు.

దూరదేశస్థులు అయినందువల్లనూ వ్యవధి లేకపోయినందువల్లనూ కేకయ మహారాజుకూ జనకమహారాజుకూ ఆహ్వానాలు అంపించలేదు. వారు ఉభయులూ ఆ వృత్తాంతము ఆ తరువాత విని సంతోషిస్తారు అని దశరథమహారాజు అనుకొన్నాడు.

ఆహ్వానాలు అందుకొని వచ్చినవారిని అందరినీ యథాయోగ్యముగా ఆభరణాదులు ఇచ్చి సన్మానించినాడు. వారివారి అర్హతలకు తగినట్టుగా విడుదులు చూపించినాడు. దేవతలను బ్రహ్మదేవుడివలె వారిని అందరినీ దశరథమహారాజు స్వయముగా చూచి గౌరవించినాడు. అంతట దశరథమహారాజు తన కొలువుకూటములో సభ చేసినాడు. ఆయనకు అభిముఖముగా రాజముఖ్యులూ నానా పట్టణ ముఖ్యులూ వివిధ జనపద ముఖ్యులూ వారివారికి నియమించిన ఆసనాలమీద కూర్చున్నారు. అంతమందీ చుట్టూ కూర్చుని ఉంటే అప్పుడు దశరథమహారాజు సుధర్మ మధ్యములో కూర్చున్న దేవేంద్రుడివలె శోభిల్లినాడు.

౨

దశరథమహారాజు తన కొలువుకూటములో సమావేశము అయిన సదస్యులను అందరినీ చూస్తూ మేఘగర్జనమువలెనూ దుందుభి ధ్వనమువలెనూ శుభావహము అంతా ప్రతిధ్వనిస్తూ గంభీరముగానూ స్పష్టముగానూ మనోహరముగానూ అపార మధురముగానూ సంతోషజనకముగానూ రాజలక్షణ యుక్తముగానూ లోకహితము కోసము ఈ విధముగా ప్రసంగించినాడు.

"మహాజనులారా, మా పూర్వీకులు అయిన రాజేంద్రులు అందరూ ప్రజలను తమ కన్నబిడ్డలమాదిరిగా కాపాడుతూ రాజ్యపాలనము చేసినారు. మా ఇక్ష్వాకు నరేంద్రులవల్లనే ఈ కోసలదేశము సుఖప్రదమూ అయిన రాజ్యము అయింది; ఉత్తమోత్తమము అయిన రాజ్యమున్నూ అయింది. ఇది మీకు అందరికీ తెలిసిన విషయమే.

"నేనూ మా పూర్వీకుల పంథాను అనుసరించి పొరపాటులేకుండా నా శక్తికొద్దీ ఇంతవరకూ మిమ్ములను కాపాడుతూ రాజ్యము ఏలినాను. లోకహితముకోసము శ్వేతచ్ఛత్రచ్ఛాయలలోనే నా వయస్సు అంతా చెల్లిపోయింది. నేను ఇప్పుడు వృద్ధుణ్ణి అయినాను. నా ఈ దేహము శిథిలము అయింది. ఇకను ఈ శిథిలదేహానికి విశ్రాంతి నివ్వవలెను.

"ధర్మసంస్థాపన రూపము అయిన రాజ్యభార నిర్వహణము సామాన్యము అయిన పనికాదు. రాజలక్షణాలతో పుట్టి జితేంద్రియుడు అయినవాడే అనేక సాధనాలతో ధర్మసంస్థాపన రూపము అయిన రాజ్యభారము వహించ కలుగుతాడు. నేను ఈ రాజ్యభారాన్ని మోసి మోసి అలసిపోయినాను. ఈ వసిష్ఠాది

—— కథానిక ——

# సుడి గుండం

రచన: లలితశ్రీ

"ఇంకా వంటకాలేదన్నమాట— అదేమిటో యెప్పుడూ ఆలస్యమే!" అన్నాడు కామరాజు షేంటు తొడుక్కుంటూ. సరిగ్గా అదే సమయానికి గోడగడియారం అరగంట కొట్టింది.

"తొమ్మిదిన్నర అయిపోయిందన్న నా జ్ఞాపకం వుందా సుశీ," మళ్ళీ అన్నాడు విసుగ్గా.

"జ్ఞాపకం లేకపోవటమేమిటి? భగవంతుడిచ్చిన రెండు చెవులుండగా విన్నాననుకోండి. వినిమాత్రం యేంచేసేది? నేను కూర్చోలేదుగా సదిలంగా ఉదయం లేచిందిమొదలు, యింతవరకూ కాస్సేపు విశ్రాంతి తీసుకుందామన్నా వ్యవధి లేకపోయింది." అంది విసురుగా సుశీల.

"విరామం లేకండా వంటపనిలో వుండబట్టే గామోసు, యింతవరకూ వంట పూర్తికాలేదు."

"ఒక్క వంటింట్లోనే వున్నానా? మీ అమ్మకి చాకిరీచేస్తేనే సరిపోతుంది. నాకిదో దినచర్యలా తయారయ్యింది. కొత్తవంట్లో సుస్తీగా వుందంటేచాలు అసలు మంచందిగిరాదు. ఎవడుచేస్తాడీ చాకిరీ అంటాను."

"ఏమిటా దురుసుతనం సుశీ! వంటొండుకోలేదంటే యిదో సాకు చెప్తావు. దానికేం చాకిరీచేస్తున్నట్టు!"

"చూస్తున్నారుగా. యింక చెప్పేదేముంది? పెళ్లయింతరువాత ఒక్కరోజయినా పోయినా, సుఖంగా కూర్చున్న మాట లేదు."

"అదిమా అమ్మ తప్పా? వంట్లో అస్వస్థతగావుంటే అదిమాత్రం యేంచేస్తుంది? నువ్వు రాకముందు యెద్దులా కష్టపడేది తెలుసా? నీకు తెలీకపోతే మా అమ్మనడుగు."

"ఏమో లెండి... నాకెందుకివన్నీను... నేనిక ఆవిడక్రింద చేయలేను. కావాలంటే నన్ను మావాళ్లింటికి పంపేయండి"

"ప్రతీసారి, యిదో బెదిరింపు... వెళ్లాలనివుంటే వెళ్లిపో, నీకెవరొద్దన్నారూ? అరె... అప్పుడే పదినిముషాలు దాటాయి. మన రాద్ధాంతాలు నిత్యమూ వున్నవేలే... నాకు మొదట అన్నం వడ్డించు..." అన్నాడు కామరాజు కోపంగా. సుశీల అన్నం పెడుతూవుంటే కామరాజు టేబిలుముందున్న కుర్చీలో కూలబడ్డాడు. సుశీల కంచంతో అన్నం తెచ్చి టేబిలుమీద పెట్టింది.

"అమ్మకికూడా వడ్డించేయకూడదూ?" అన్నాడు కామరాజు మెత్తగా. సుశీల జవాబివ్వకుండా మూతివిరుచుకుంటూ అక్కడినుండి పోయింది. కామరాజు తల్లి వరహాలు మంచంపై కూర్చుంటూ "ఎందుకులేరా! నేనే వడ్డించుకొంటాను." అంది.

"వడ్డిస్తుందిలే అమ్మా..." అని ముభావంగా అన్నాడు కామరాజు. ఆ నేకాదే గాని సుశీల వడ్డించదన్న భయం ఓమూల వుండనేవుంది. అవునే, ఆమెమనసు తేలికగా, వుల్లాసంగా వున్నప్పుడు అత్తకింద చీదరించుకోకండా చాకిరీ చేసిన రోజులు లేకపోలేదు. కాని ఆరోజులు వ్రేళ్లపై లెక్కపెట్టవల్సినంత అరుదు.

"ఎందుకురా, రాజా! నాగురించి మీరిద్దరూ ఘర్షణపడతారు? అసలు నేనిక్కడుండటం ఆమె కిష్టంలేదు. నాలుగు రోజులపాటు చిట్టిదగ్గరకెళ్లి వుండాలనివుంది" అందివరహాలు. ఆమె అలా అంటుందని, ఆ అదనుకోసమే వేచివుందని కామరాజుకి తెలుసు. ఆమె మనసంతా చిట్టిదగ్గర - మనిషిమాత్రం కామరాజుదగ్గర.

చిట్టి కామరాజు చెల్లెలు. ఆమె కూడా ఆవూర్లోనే వుండటం, సమస్యను మరింత తేలిక చేసినట్టయింది. ఆమె ఆవూర్లో కాకండా మరే యితర దూరప్రదేశంలోవున్నా వరహాలు చటుక్కున అలాఅనేదికాదు. "చిట్టి" అంటే వరహాలుకి మమకారం యెక్కువ. ఆమెకేకాదు. ప్రతితల్లికి (కూతుళ్లు, కొడుకులున్న తల్లులకి) కూతురంటె కొడుకుకంటె యెక్కువ ప్రాణం. అందుకే ఆడపిల్లపుడితే తండ్రి యెంతగా బాధపడతాడో (కట్నాలు పొయ్యలేక) తల్లి అంతగా ఆనందిస్తుంది. "నువ్వు దూరంగా ఆలోచించటంలేదమ్మా! నువ్విప్పుడు వెళ్లిపోతే ఆపనింద యెవరికొస్తుందంటావు? మీ యిద్దర్ని యెవ్వరూ ప్రేరేపించారని బాధ్యతంతా నామీద వేసేస్తారు. మీ యిరువురిమధ్య సామరస్యత కుదర్చలేకపోయాననని నన్నే అంటారుగాని, ఏకమత్యంగా వుండలేదని మిమ్మల్నెవరూ అనరు."

"ఎందుకంటార్రా! పరాయివాళ్ళయింటికి పోలేదుగా - కూతురుదగ్గరికెళ్తున్నా."

"ఓ సమ్మా... నువ్విక్కడిలానే అంటావు. కాని అక్కడికి వెళ్లాక నువ్వే అందరితో చెప్తావు, యిక్కడ వుండలేక, అవిడతో వేగలేక వెళ్లిపోయానని..."

"నువ్వలా అనుకుంటున్నావుగానీ, రాజా. యెంత తెలివితక్కువదైనా యింటిగుట్టు బయటపెట్టుకుంటుందా?"

"అంతదూరం ఆలోచించే వాళ్లైవున్నారు లేదమ్మా; ఒక్క మాటలు చెప్పటమే తెలియదు... అని అదవాలో పెట్టినంతలోమాత్రం పప్పులో కాళ్లేస్తారు."

"దానిమాటకేంగాని, యిక్కడెలా వుంటేదిరా? నేనా చేసుకోలేనాయె... చేసేవాళ్లా లేరాయె. మరి యెట్లా?"

"ఎందుకు లేదూ? అదిచేస్తుంది."

"నువ్వన్నప్పుడల్లా తీర్లేక, తప్పదు గనుక, మూతి విరుచుకునో, ముక్కు చీదుకునో యేలాగో చేస్తుంది. నువ్వు యిల్లు దాటావా యిక ఒకటే వుపన్యాసం..." అని వరహాలంటూండే సుశీలకోపంగా అక్కడికొచ్చి నడుంపై చేయి వేసుకుంటూ,

"ఇల్లాంటి అబద్ధపు చాడీలు చెప్పొద్దన్నాను. అందుకే నాకు నీతో మాట్లాడ్డమంటేనే అసహ్యం. నేనేం వుపన్యాసాలిచ్చానో జ్ఞాపకముంటే చెప్పు అత్తా! సత్యమన్నది నీదగ్గర లేకపోబట్టే యిలా మందం పట్టావు" అంది సుశీల

"నేను మందంపట్టడానికి కారణమంటావు?"

"ఎవరికివాళ్లే కారణమవుతారు..."

"నువ్వనిచెప్పడంలే నిగ్గుతేలుకదూ మరి-కోడలు రావటంతో అత్తమంచమెక్కిందని యెంతమంది అంటూండటం లేదు?"

"నీలాంటివాళ్లెవరో అనాలి".

"పో నీ లే... పైన పరమేశ్వరుడు లేడూ? అత్తని యిన్ని యిక్కట్లకు పాల్చేస్తున్న నీకు కోడలొస్తుందిగా, అప్పుడు ప్రతిఫలం అందుతుంది" అంది వరహాలు యెత్తిపొడుస్తూ.

"ఓహో! అలాగా, నీ అత్తను నువ్వెన్నో బాధలుపెట్టబట్టే అవన్నీ యిప్పుడు నీకనుభవమవుతున్నయంటావు...అందుకే యిప్పుడు జ్ఞాపకమొచ్చినయ్." అంది సుశీల.

కామరాజు విసుపోయాడు. తల్లిపైకంటె సుశీలమీదకోపం హెచ్చింది, ఆమె పెద్దా, చిన్నా, అన్న అంతరం లేకండా నోటికొచ్చినట్టంతా మాటాడేస్తుందని. ఎంతవరకలా చూస్తూవూరుకుంటాడు? సహించలేకపోయాడు.

"ఏమిటి సుశీలా! యిప్పటికైనా కాస్తతగ్గుతావా? పెద్దది - దాంతో నీకేమిటి?" అన్నాడు కోపంగా.

"అమర్యాద అవిడ వుంచుకుంటేగా. వుంచుకుంటేనే చిన్నవాళ్లు వాళ్లని పూజిస్తారు."

"చాల్లే-మరేంలేకపోయినా మాటలు మాత్రం నేర్చుకున్నావు. మీ తగవులు కామగాని, నా ఆఫీసుకి వేళయిపోయింది" అంటూ చేతులు కడుక్కుని వెళ్లిపోయాడు కామరాజు.

2

"ఒరేయ్ రాజా! చిట్టి కూతుర్ని చూడాలనివుందిరా, యిప్పుడే వెళ్లాను. మళ్లీ రెండురోజులు పోయాక వచ్చేస్తాను." అంది వరహాలు మెల్లిదిగా.

"ఎందుకమ్మా యిప్పుడు? చెబితే విన్పించుకోవు... మొన్ననేగా వెళ్లి వచ్చావు?" అన్నాడు కామరాజు.

"గడచిన రాత్రంతా అదే కల్లోవుందిరా...అదేమిటో, కాలం మారిపోయింది గాని, చిన్నవాళ్లదగ్గర అనుమతి పొందాల్సిన గతిపట్టిందిమాకు ... మీ నాన్నగారుంటేనా-నాకెందుకీపాట్లు? కన్నకూతుర్ని చూడ్డానికి వెళ్లొమన్నా స్వతంత్రంలేదు." అంది వరహాలు ముసుగుకొంగు లంకించుకుంటూ.

కామరాజుకి తల్లిగుణం అంతగా నచ్చలేదు. ఒకరేడ్చినా, అర్థంలేకండా ముడుపుముఖం పెట్టినా అతనికి వళ్లు మండిపోతుంది.

"నీ యిష్టమమ్మా! ఎందుకు చెప్పా... అర్థంచేసుకోలేకపోతే నేనేం చేసేది?" అన్నాడు కామరాజు.

"నాకుతెలుసురా, నామాట కొట్టిపారేయవని. మళ్లీ రెండురోజులు పోయాక వచ్చేస్తానే" అంది వరహాలు నవ్వుతూ.

"రెండు రోజులు కాకపోతే పదిరోజులు పోయాక రా అత్తా" అంది సుశీ కోపంగా. సుశీల అక్కడికెప్పుడు వచ్చిందా అనుకుని ఆశ్చర్యపోయాడు కామరాజు. వరహాలు కోపంగా కోడలువేపు చూస్తూ కొడుకువేపు తిరిగింది.

"చూశావట్రా! దాని మాటలు— అసలు నేనిక్కడుండటమే దానికిష్టం లేదు. చిట్టి దగ్గరికి పోతానంటె నువ్వు వినవాయె. ఎలా చచ్చేదింక? యీ ముళ్ళకంపలమీద నేనుండలేను బాబూ" అంది వరహాలు.

కామరాజు మళ్లీ సందిగ్ధత పడ్డాడు సుశీలకెన్నిసార్లు చెప్పినా, అత్తతోటి ప్రతిమాటలోనూ అవిడ ద్వేషం కలిగించుకుంటుంది. ఎందుకో? అనుకున్నాడు.

"నువ్వెళ్లి నీపనులు చూసుకో సుశీ! మేం యేం మాట్లాడుకున్నా నువ్వెందుకిక్కడ" అన్నాడు సుశీవేపు తిరిగి. సుశీలమూతి విరుచుకుంటూ వెళ్లిపోయింది.

"చూశావమ్మా! నువ్వు ప్రతిసారి చిట్టిదగ్గరికి పోతాననటం బావుండలేదు. కారణాలు ఇంతకుముందే వివరించాను. పోతే, నువ్వు చెల్లిగారింట్లో యెన్నాళ్లివుంటావు? శాశ్వతంగా అక్కడే వుండగలవా?" అన్నాడు కామరాజు కన్పించని కోపంతో.

"శాశ్వతంగా యెందుకుంటానురా? కొద్ది రోజులుండి మళ్లీ వచ్చేస్తాను."

"అవునే నీవెళ్లటంలో అర్థంలేదన్నమాట. సుశీలబారినుండి తప్పించుకోవాలనికదూ నువ్వక్కడికి వెళ్లటం— ఎప్పటికైనా మళ్లీ సుశీలదగ్గరికే రావాలిగా. ఇప్పటి సుశీలే అప్పుడూ ఉంటుంది. ఇప్పటి పరిస్థితి కూడా అప్పుడుండదు."

"ఎందుకుండదురా? కొన్నాళ్లు నేను దూరంగా వుంటే అవిడ మనసు మారుతుందేమో!"

"అది అసంభవమమ్మా! మీ ఇద్దరి హృదయాల్లో అర్థంలేని ఆవేశాలు బాక్కునివున్నయ్. ఇప్పుడు ఎవరూ వాటిని బహిర్గతం చేయలేకపోతున్నారు. చేయలేరు కూడాను. ఎందుకూ అంటే ఆ ఆవేశాలకి అర్థంలేదు— నిజ స్వరూపాలు లేవు. ఇక నువ్విప్పుడు వెళ్లిపోతే మీ హృదయాల్లోని ఆ వేశాలు యెలాంటి వలానే కాపురముంటయ్. ఎప్పటివరకంటావేమో! ఇద్దరూ ఒకే దగ్గరుండి, ఒకరి మనసొకరర్థం చేసుకున్నంతవరకు—" అన్నాడు కామరాజు. కొడుకు వ్యంగ్యపు న్యాయం ఒక్క పిసరైనా అర్థంకాలేదు వరహాలుకి.

"నువ్వేం చెప్పావో నాకర్థంకాలేదు. ఇప్పుడు మరెందుకన్నీ ఓ రెండు రోజులకోసం వెళ్తున్నా"

"సరే అలాగే కాని అమ్మా! చూశావా— అప్పుడే తెగిపోవలసిన విషయాన్ని ఇంత వరకు యీడ్చవల్సి వచ్చింది" అంటూ యిక్కడ్నించి పోయాడు కామరాజు.

ఆరోజు సాయంకాలమే బయలుదేరి కూతురింటికి వెళ్లిపోయింది వరహాలు. తల్లి అకస్మాత్తుగా ముందుకబురైనా లేకండా రావటంలో అర్థాన్ని తెలుసుకోలేకపోయింది చిట్టి.

"ఇదేమిటమ్మా! యీ వేళప్పుడొచ్చావు? నిన్ననే ఆయనక్కడికి వచ్చారుగా అప్పుడే చెప్పలేదు" అంది చిట్టి.

"లేదులేవే...అదంతా పెద్దకథ... తరువాత చెప్తాలే" అంది కూర్చుంటూ వరహాలు.

ఆరోజు రాత్రి అన్ని విషయాలు సవిస్తరంగా కూతురితో చెప్పింది వరహాలు. అప్పటికీ సుశీలపై ఆమెకోపం చల్లారలేదు. ఇరుగు పొరుగు వాళ్లతోనూ, బంధువులతోనూ చెప్పక తన హృదయంలోని బడబాగ్ని బయటకు రాదనుకుంది. ఆరోజు గడిచింది.

మరుసటిరోజు వుదయం పదిగంటలకు యిరుగు పొరుగువాళ్లు యెదురింటి వెంకటరత్నం వరహాల్ని చూడ్డానికి వచ్చారు. వరహాలకి దూరపుచుట్టం వెంకటరత్నం. అయినా వరహాలంటే యెంతో అభిమానం ఆమెకి.

"సుశీల చాలరోజులనుండి యిక్కడికి రావటమే మానుకుందే?" అంది పొరుగింటి పున్నమ్మ.

"ఎందుకొస్తుందీ! అవసరముంటేగా... అవిడ కెంతసేపు వాళ్లవాళ్లుంటే చాలు" అంది చిట్టి యెత్తిపొడుస్తూ.

"మరి- మీ అన్నయ్య వూరుకుంటాడేం?" అంది వెంకటరత్నం.

"వూరుకుంటాడా? ఎప్పటికప్పుడే పయనం చేస్తుంటాడుట...అవిడ పయనాన్ని పోడిగిస్తుంది... రేపో మాపో వస్తాడుటలే..." అంది చిట్టి మళ్లీని.

"వస్తారు వెంకటరత్నం...ఏమిటో మావాడు శాంతపరుడు కాబట్టి సరిపోయింది గాని మరొకడైతే మొగుడెతే తెలిసొచ్చేది. ఎప్పుడూ నాతో విరోధమేకదూ! ఏదో ఒకటి గొణుక్కుంటుంటుంది."

"అదేమిటక్కయ్యా, అలా అంటావు? సుశీల చాల మంచిపిల్లలా కన్పిస్తుంది," అంది రత్నం ఆశ్చర్యపోతూన్నట్టుగా ముఖం పెడుతూ.

"అదంతా నటనలే—" ముఖం ప్రక్కకి తిప్పుతూ, చెప్పింది వరహాలు.

"మరి- మన రాజైనా యేమీ అనడూ?"

"వాడిసంగతి తెలుసుగా- గొప్ప ముభావపు మనిషి. ఒకరితో పేచీపడ్డం వాడికిష్టముండదు. అవిడ వాదనకంటుండదు. అందుకే యిరుగు పొరుగు వాళ్లింటారన్న భయంలో వూరుకుంటాడు."

"అలాగని తల్లీ, పెళ్లాం తగవులాడుకుంటుంటే, పెళ్లాన్ని మందలించొద్దూ! యిదేం చోద్యమమ్మా! ఏదీ యీసారి వాడురానీయ్, అడుగుతా" అంది రత్నం.

"అదేవద్దు రత్నం- అసలు మొదటే వాడనుమానంలో అన్నాడు నేనిక్కడ మీ అందరితో యీ విషయాలన్నీ చెప్తానని...నువ్విప్పుడడిగావా, నాపై కారాలు, మిరియాలు, నూరుతాడు."

"అదేమిటో! కొడుకుదగ్గర తల్లి దుఃఖపడటం నేనెక్కడా చూడలేదు."

"కలికాలంలో అంటే అలా లేదు గాని, యిప్పుడంతా అంతే! కాలం మారిపోయింది."

"పోనీ, వాడీసారివస్తే నాదగ్గరికి రమ్మను. మామూలుగా చెప్పిచూస్తాను" అంది వెంకటరత్నం.

"పోనీ అమ్మా! యిక చాలించండి. అన్నయ్య బజారుకొస్తే రావచ్చు" అంది చిట్టి మందలిస్తూ.

మరికాస్సేపు అవీ, యివీ, మాట్లాడుకొన్న తరువాత యెక్కడివాళ్లక్కడికి వెళ్లిపోయారు.

3

ఆరోజు ఆదివారం కామరాజు యింట్లోనేవున్నాడు. ఉదయం కాఫీ త్రాగిన తరువాత ఓసారి తల్లిదగ్గరికి వెళ్లొద్దామనుకున్నాడు. సుశీల కిష్టంలేదు...

"ఇప్పుడెందుకండీ! ఏం? మీ రక్కడా తల్లిని చూడకపోతే తృప్తి వుండదూ?" అంది విసురుగా.

"అంతే తెలుసులే నీకు...తల్లి వచ్చి రెండురోజులయినా ఒక్కసారయినా రాలేదని అక్కడి వాళ్లనుకోరూ? అదీ గాకండా రేపు వచ్చేస్తానందిగా, వచ్చేయమనాలి. మరి..."

"మీరెందుకు చెప్పటం, వచ్చేయ మనికి ఇష్టమున్నప్పుడు తనే వచ్చేస్తుంది"

"ఏం? ఆవిడవుంటే నీకు కష్టంగా వుంటుందా?"

"నిజమే! కష్టంకాదూ? మీకేం పోయింది. చక్కా భోజనం ముగించి ఆఫీసుకిపోతారు. ఇక అవిడ సేవలు చేసుకు రావాలి"

"అవసరం లేదులే. అదే చచ్చేదో చేసుకుంటుంది...నీలాంటి కోడళ్లుంటే అంతకంటె యెక్కువ వాళ్లకేముంది? నిజం చెప్పాలంటే సుశీ, మీ యిద్దరి తగవులవల్ల నేను పలాయనం చిత్తగించవలసివస్తుందేమో, ననుకొంటున్నా" కాస్త సీరియస్‌గా అన్నాడు కామరాజు. నిజమే మరి యిరువురిలో యెవర్నీ మందలించలేక పోతున్నాడు. ఇరువురూ ఒకవైపు వుంటే పచ్చగడ్డి సహితం భగ్గుమంటుంది.

"నేను మాట్లాడితే, అదిమాత్రం కలవిస్తుంటారు. నా కెందుకు లెండి యివన్నీను" అంటూ మౌనంగా ముఖం వెనుకకు తిప్పుకుంది. కామరాజు చిరాకుగా సైకిలు పట్టుకుని బయటకు నడిచాడు.

కామరాజు, చిట్టింటికి వచ్చేసరికి వరహాలు అన్నంతింటూంది. మాటా మంతీ అయింతరువాత,

"ఎప్పుడొస్తావమ్మా?" అన్నాడు కామరాజు. వరహాలు యేదో అనబోతూంటే చిట్టి అందుకుని

"ఇప్పుడేం తొందర అన్నయ్యా! చూస్తే దీనికి రోజురోజుకి సన్నగిల్లిపోతూంది. నిన్నకంటె పైనా కడుక్కోలేని స్థితిలోవుంది. అక్కడ చేసేవాళ్ళెవరున్నారు? ఇక్కడే వారం నాలుగురోజులుంటుంది" అంది. కామరాజు మనసు చివుక్కుమంది.

అతిదర్థంచేసుకోగలిగాడు తల్లి అక్కడిసంగతులన్నీ చెప్పింది ఇంకేమిటంటాడు?

"సరేలే - నే నొస్తానమ్మ" అంటూ బయలుదేరాడు.

"నిన్నోసారి వెంకటరత్నం రమ్మందిరా..." అందివరహాలు. "ఎందుకూ?", ఆశ్చర్యంగా అడిగాడు కామరాజు.

"ఏమో తెలీదు..." అంది మళ్లీను.

కామరాజు యెంత ఆలోచించినా అంతుచిక్కలేదు. తనతో వెంకటరత్నంకి యేమిటి అవసరమాఅని. దగ్గరే యిల్లు గనక వెళ్ళక తప్పిందికాదు.

"సరే..." అంటూ తిన్నగా యెదురింటికి పోయాడు.

"రా, రాజా! ఎక్కడ మనిషివి కన్పించటమే మానేశావు. కొత్త సంసారం మరి..." అంది నవ్వుకుంటూ వెంకటరత్నం.

నిజానికి వెంకటరత్నం మంచి మాటకారి. మాటకారి గాబట్టే భర్త చనిపోయినా, కొడుకుని పెంచి పెద్దవానిగా చేసి, పెళ్లిచేసి కాపరం పెట్టించింది. కొడుకు దగ్గరే వుంటూ కోడల్ని సుఖపెడుతుంది పని పాటలన్నీ తనే చేసి.

"ఏమీ లేదు పిన్నీ - మారంలో వున్నాం... రావటమంటే కష్టమే మరి..."

"జాను లేరా... కూర్చో"

"ఫరవాలేదులే పిన్నీ... నాకింకో పోలెను పనుంది. ఆ! ఎందుకో పిల్చావంట కదూ!"

"ముఖ్యం లేదు... చాల దినాల నుండి కన్పించలేదని, ఓసారి చూద్దామని. పనేగాని, అమ్మని ఓపదిరోజులపాటు చెల్లిదగ్గరుంచకూడదట్రా" అంది వెంకటరత్నం.

"ఎందుకు పిన్నీ! వచ్చి అప్పుడప్పుడు రెండుమూడు రోజులుంటుందిగా"

"అక్కడుండి నానాపాట్లు పడ్డం యెందుకు? లేచి తిరుగలేని స్థితిలో వుంది మరి... తన పనులన్నీ తనే చేసుకోవాలాకి అవన్నీ తలంచుకుని బాధ పడుతోంది తెలుసా?" అంది మెంచి నవ్వుగా.

కామరాజు చిన్న నవ్వునవ్వాడు. తల్లి యిక్కడే వాళ్లందరితో డప్పా వాయించిందని వచ్చాడు. ఆమెపై చెప్పలేనంత కోపం తన్నుకొచ్చింది.

(10వ పేజీ చూడుడు)

# తెలంగాణా రాష్ట్ర వాదం: ఒక దృక్పథం

రచన: "కృష్ణ మోహన్"

రాష్ట్ర పునర్విభజన సంఘం హైదరాబాదులో తన పని ముగించుకు వెళ్లిపోయింది. హైదరాబాదు నకు సంబంధించినంతవరకు సంఘం ఎదుట రెండు సమస్యలున్నాయి. మొదటిది: హైదరాబాదు రాష్ట్రాన్నిచ్ఛిన్నం చెయ్యవలెనా, కూడా అని; రెండవది: రాష్ట్రం విచ్ఛిత్తికి అంగీకరించిన పక్షంలో తెలుగు భాషాప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా చెయ్యవలెనా లేక ప్రస్తుత ఆంధ్రరాష్ట్రంతో కలిపి విశాలాంధ్రాన్ని ఏర్పరచవలెనా అని.

మొదటి సమస్యకు సంబంధించినంతవరకు ప్రజలలో చాలమటుకు ఒకే అభిప్రాయం ఉందని చెప్పవచ్చు. హైదరాబాదు రాష్ట్ర విచ్ఛిత్తిని వ్యతిరేకించేవారు బహుతక్కువమంది. ఈ వర్గ ప్రజలు ప్రాంతీయంనుండి రెండుమూడు తరాలకిందట హైదరాబాద్‌కి వలసవచ్చి ఇక్కడ స్థిరనివాస మేర్పరచుకొన్న హిందూ ముస్లిం కుటుంబాలు కొన్ని ఉన్నాయి. ఈ కుటుంబాలకు చెందిన వ్యక్తులు రాష్ట్ర పరిపాలనలో ప్రముఖపాత్ర నిర్వహిస్తూ ఉంటారు. ప్రభుత్వం ఏ పక్షం చేతుల్లో ఉంటే ఆ పక్షాన్ని వీళ్లు సమర్థిస్తూ ఉంటారు. సుమారు పదసంవత్సరాల క్రితం "స్వతంత్ర హైదరాబాద్" నినాదాన్ని సమర్థించిన హిందూ నాయకులందరూ ఈ తెగకు చెందినవారే. వీరికి ప్రోత్సాహం రెండు మూడు తరాలనుంచి దక్షిణభారతం నుంచి తరలివచ్చి స్థిరపడ్డ వ్యక్తులవద్ద నుంచి కలుగుతుంది. హైదరాబాద్ రాష్ట్ర విచ్ఛిత్తిని వీరు వ్యతిరేకించడంలో, "దక్కన్ కల్చర్" నినాదాన్ని లేవదీయడంలో వింత ఏమీ కనబడదు.

ఇక పునర్విభజనసంఘం సాధింపవలసిన రెండవ సమస్య. హైదరాబాద్ విచ్ఛిత్తికి అంగీకరించిన పక్షంలో, తెలుగు భాషాప్రాంతాలను ప్రస్తుత ఆంధ్రరాష్ట్రంలో కలిపి వెయ్యడమా లేక ప్రత్యేకరాష్ట్రంగా చెయ్యడమా అన్నది. ఇది క్లిష్టసమస్య. చిక్కుపడిన ప్రజలముందు అవిభాజ్య హైదరాబాద్ రాష్ట్రమా లేక విశాలాంధ్రమా అన్నదిమాత్రమే సమస్య. తెలుగుజిల్లాలన్నిటిని ప్రత్యేక తెలంగాణా రాష్ట్రంగా చెయ్యడం సంభవం అన్నది ప్రజలకు మొదటిసారిగా మేడు స్ఫురించింది. వరంగల్‌లో సమావేశమయిన ప్రజాపార్టీ మహాసభలో కొందరు ప్రతినిధులు తెలంగాణా రాష్ట్రం ప్రత్యేకంగా ఉండాలని మొదటిసారిగా అన్నారు. తర్వాత, ఈ మధ్య ప్రదేశ్ కాంగ్రెసు తెలుగు ప్రతినిధుల సమావేశం ప్రత్యేకరాష్ట్రం కావాలని కొద్ది మెజారిటీతో తీర్మానించింది. ప్రత్యేకరాష్ట్రాన్ని వాంఛించే ప్రదేశ్ కాంగ్రెసునాయకులలో రాష్ట్రఆహారశాఖామంత్రి డా॥ చెన్నారెడ్డి, ప్రదేశ్ కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు శ్రీ రంగారెడ్డి ముఖ్యులు.

ఈ నాయకులు ప్రత్యేకరాష్ట్రానికి అనుకూలంగా పునర్విభజన సంఘానికి ఒక నివేదిక సమర్పించారు. ఆ నివేదికలో విశాలాంధ్ర నిర్మాణంయెడ తమ వ్యతిరేకతకుగల కారణాలు; తెలంగాణం ఆర్థికస్తోమతకలిగిఉంటుందని తాము భావించడానికిగల కారణాలు వ్యక్తం చేశారు. విశాలాంధ్రనిర్మాణాన్ని సమర్థించడం ఈ వ్యాసంయొక్క ముఖ్యోద్దేశం కాదు. తెలంగాణా ఆర్థిక స్వావలంబన కలిగిఉండేపక్షంలో తప్పక ప్రత్యేక తెలంగాణం ఏర్పడాలని ఈ వ్యాసకర్త భావిస్తున్నాడు. కాని ప్రత్యేక తెలంగాణా రాష్ట్రసమస్యను ఆర్థిక దృక్పథంనుండిగాక, రాజకీయ దృక్పథంనుండి పరిశీలిస్తే, అది రాష్ట్ర ప్రజానీకానికి మరింత హానికరంగా పరిణమించగలదనే భావంతో, ఈ ప్రత్యేక రాష్ట్ర వాదాన్ని సాధ్యమయినంతవరకు ఆర్థికదృక్పథంనుంచే పరిశీలిస్తాడు వ్యాసకర్త. ఈ వ్యాసంలో యీయబడిన సంఖ్యలలో చాలవరకు పలు నాయకుల నివేదికలనుంచే స్వీకరింపబడ్డాయి.*

తెలంగాణా ఆర్థికస్తోమత కలిగి ఉంటుందా లేదా అన్న ప్రశ్నకు సమాధానంకోసం రాష్ట్ర ఆదాయవ్యయ పరిశీలనం చెయ్యడంలో వింత ఏమీలేదు. అల్లా చేసేముందు, ఒక సంగతి గమనించాలి. రాష్ట్రవ్యయం ఆదాయంకంటె తక్కువగా ఉన్నంతమాత్రంచేత ఆ రాష్ట్రం ఆర్థిక స్తోమతు కలిగిఉండదని చెప్పడం సాహసం కాగలదు. విజ్ఞానికి సాంఘిక సంక్షేమం అతియంగాగల ఏ ప్రభుత్వం చేసిన బడ్జెట్ అయినా లోటుబడ్జెట్ కావడానికి అవకాశాలు ఎక్కువున్నాయి. ఇదేవిధంగా ఒక రాష్ట్ర ప్రభుత్వం తన బడ్జెట్‌లో మిగులును చూపించినంతమాత్రాన ఆ రాష్ట్రం ఆర్థికంగా సుస్థిరత్వాన్ని పొందిందని భావించడం పొరపాటు అవుతుంది. ఒక ప్రభుత్వం తను ఖర్చు చేయవలసిన పరిస్థితులలో చాలినంతగా ఖర్చు చేయక పోవడంవల్ల మిగులును చూపించవచ్చు—లేదా, ప్రజలపై అత్యధికంగా పన్నులు విధించి, మిగులును చూపించవచ్చు.

తెలంగాణా ఆదాయం రూ. 1381 లక్షలు. ఇదికాక ఆదాయపు పన్ను మొదలైన పన్నులలో నేటి హైదరాబాద్ యొక్క వాటా రూ. 340 లక్షలు. ఇందులో రెండుకోట్ల రూపాయలను తెలంగాణాయొక్క భాగంగా తీసికొనవచ్చును. ఈ సంఖ్య (2 కోట్లు) నిజానికి కనీసపు సంఖ్య. ఈ పన్నుల వసూళ్లు ముఖ్యంగా హైదరాబాద్ సికిందరాబాద్ నగరాలనుండి జరుగుతాయి. అవి తెలంగాణంలోనే చేరతాయి కాబట్టి మనము రూ. 2 కోట్ల కంటె ఎక్కువ ఆదాయాన్నే ఆశించవచ్చును. దీనికి తోడు, పారిశ్రామిక గృహవసతి, కోయలు-మరి ఇతర ఆటవిక జాతుల పునరావాసము ఇటువంటి వానిపై ఖర్చుకుగాను కేంద్రప్రభుత్వం మంజూరు చేసే గ్రాంట్లు రూ. 119 లక్షలవరకు ఉంటాయని భావించవచ్చును. అందుచేత, ప్రతిపాదిత తెలంగాణారాష్ట్రపు ఆదాయం రూ. 17 కోట్లు ఉంటుంది.

ఇక వ్యయం సంగతి. నేటి హైదరాబాదు రాష్ట్రంపై ప్రభుత్వం మొత్తం రు 2625 లక్షలను వ్యయంచేస్తూంది. ఇందులో జిల్లాలలో ప్రభుత్వ యంత్రాంగంపయి చేసే వ్యయం రు 1120 లక్షలు. అంటే రాజధానిలో రాష్ట్రమంతటిపయిన చేయవలసిన వ్యయం రు 1505 లక్షలు. దీనిలో తెలంగాణాకయ్యే ఖర్చు రు 845 లక్షలు అని అంచనా వెయ్యబడింది. దీనికి తెలంగాణాకు చెందిన తొమ్మిది జిల్లాల పాలుకోలూకాలలోను ప్రభుత్వ యంత్రాంగంపయి చేసే ఖర్చు రు 626 లక్షలు కలుపుకొంటే మొత్తం తెలంగాణాకు అయ్యే ఖర్చు రు 1471 లక్షలు (రు 845+రు 626 లక్షలు) అని తేలుతుంది. అయితే తెలంగాణా ప్రత్యేకరాష్ట్రం కాబోతున్నది కాబట్టి ప్రత్యేక రాష్ట్రానికి కావలసిన హంగులన్నిటికోసం రు 100 లక్షలను చేటాయిస్తే మొత్తం తెలంగాణాకయ్యే ఖర్చు రు 1571 లక్షలవుతుంది. అంటే ప్రతిపాదిత తెలంగాణా రాష్ట్రంలో సుమారు రు 120 లక్షలు (రు 1700 లక్షలు-రు 1571 లక్షలు) మిగులు ఉంటుంది. ఈ మిగులును సాంఘిక సంక్షేమం, ఆర్థికాభివృద్ధి ప్రణాళికల పయిన వ్యయం చేసికోవచ్చు.

ఈ పైన చెప్పినదంతా ఆదాయ వ్యయ సంబంధమయిన సంఖ్యలతో సహా వారి నివేదికనుండి స్వీకరింపబడినదే. వారి నివేదికలో ఆదాయాన్ని ఇంకా పెంచడానికి వ్యయాన్ని మరింత తగ్గించడానికి కొన్ని సూచనలు చేశారు. ఆ సూచనలు పరిశీలించడానికి ముందు ఆదాయవ్యయాలను గురించి కొంత పరిశీలించవలసి ఉంటుంది.

కేంద్రప్రభుత్వం వసూలు చేసే కొన్ని పన్నులలో కొంతభాగం రాష్ట్రప్రభుత్వాలకు పంచిపెడుతుంది. ఒక్కొక్క రాష్ట్రానికొచ్చే వాటా; ఆ రాష్ట్రంలో కేంద్రానికి వసూలయిన పన్నుల మొత్తంపయిన కాక, ఆ రాష్ట్రపు జనసంఖ్య పయిన ఆధారపడి ఉంటుంది. హైదరాబాద్ రాష్ట్రపు వాటా రూ. 340 లక్షలు. తెలంగాణా జనసంఖ్య హైదరాబాద్ జనసంఖ్యలో 56% ఉంటుందని భావించబడుతోంది. అందుచేత పయిన చెప్పిన పన్నువసూళ్ళలో తెలంగాణకు భాగంగా సుమారు రూ. 190 లక్షలు (రూ. 340 లక్షలలో 56%) లభ్యం అవుతాయి. యీ సంగతి గమనించకుండా పన్నువసూళ్ళలో తెలంగాణా భాగం—హైదరాబాద్ సికిందరాబాద్ నగరాలు తెలంగాణాలో ఉన్నాయి కాబట్టి—రూ. 200 లక్షలను మించుతుందని వారనడం చాలా ఆశ్చర్యకరమయిన విషయం.

కేంద్రప్రభుత్వం grants in aid అనే పేరుతో ప్రత్యేకంగా కొన్ని గ్రాంట్లను ఇస్తుంది. అవి వేనికోసం నిర్దేశింపబడ్డాయో వానిపైననే వ్యయంకావలసి ఉంటుంది. వ్యయంచేయని మొత్తాన్ని తిరిగి కేంద్రప్రభుత్వానికి స్వాధీనం చెయ్యవలసి ఉంటుంది. కేంద్ర ప్రభుత్వంతో ప్రత్యేకంగా చేసికొన్న ఒడంబడిక ఏదయిన ఉంటే తప్ప యీ మొత్తాలను రాష్ట్ర రెవెన్యూలలో కలపడానికి వీల్లేదు. నివేదిక చదివితే అటువంటి ఒడంబడిక ఏదీ ఉన్నట్లు స్ఫురించదు. యీ విషయాన్ని నివేదిక కర్తలు పూర్తిగా విస్మరించడం చాలా ఆశ్చర్యకరమయిన సంగతే! మరో విషయం. తెలంగాణకు గ్రాంట్లు రూ. 119 లక్షలుగా అంచనా వేశారు. యీ సంఖ్య వీరికెట్లా వచ్చిందో దురూహ్యం. యీ సంఖ్య కనక నిజమయితే హైదరాబాద్ రాష్ట్రం మొత్తానికి గ్రాంట్లు రూ. 212 లక్షలు కేంద్రప్రభుత్వం ఇచ్చిఉండాలి. 1953-54 బడ్జెట్ పరిశీలిస్తే అంతమొత్తానికి కేంద్రం గ్రాంట్లను మంజూరుచేసినట్లు తోచదు.

అంటే తెలంగాణా ఆదాయం (రూ. 1381 లక్షలు + రూ. 190 లక్షలు) రూ. 1571 లక్షలు అవుతుంది, ఇంక వ్యయాన్ని పరిశీలిద్దాం.

నివేదికలో ఇచ్చిన వివరాల ప్రకారం హైదరాబాద్ రాష్ట్రానికి వ్యయం 1953-54 లో రూ. 2624 లక్షలు. యీ సంఖ్యను వారు ఎక్కడనుండి తీసుకొన్నారో తెలియదు, ఇది తప్పు. 1953-54 సం॥ లో అయిన వ్యయం అసలు రూ. 2744 లక్షలు (చూ. రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా వారి బులెటిన్-మే సంచిక) దీనికి బదులు వారు 1953-54 సం॥ యొక్క కాని; 1954-55 సం॥ యొక్క కాని వ్యయంయొక్క సంఖ్యను తీసుకొంటే అది ఇంకా ఎక్కువ వచ్చిఉండేది. అందుచేత నివేదికలో వారు వ్యయాన్ని రూ. 120 లక్షలు తక్కువ తీసుకొన్నారు. యీ విధంగా తీసుకోవడం వల్ల తెలంగాణలో తప్పు-67 లక్షలవుతుంది. అంటే తెలంగాణా వ్యయం నివేదికలో చెప్పిన ప్రకారం రూ. 1571 లక్షలు కాక రూ. 1638 లక్షలు అవుతుంది. అందుచేత తెలంగాణా రాష్ట్రం మిగులురాష్ట్రం కాక లోటు రాష్ట్రం అని తేలుతుంది.

అయితే క్రింద కేంద్రప్రభుత్వం చేసిన గ్రాంట్లు వ్యయం రూ. 2744 లక్షలలో వేర్వేరు పద్దులలో అమర్చబడి ఉండవచ్చు. అటువంటి పరిస్థితులలో కూడా రూ. 67 లక్షల లోటును తీర్చగల ధనసహాయం కేంద్రం చేసిందనడానికి సూచనలు తక్కువ.

## ఆదాయం హెచ్చింపు. వ్యయం తగ్గింపువారు సూచించిన మార్గాలు

తెలంగాణం మిగులు రాష్ట్రం కాదు-లోటు రాష్ట్రం అనుకోడానికి నిదర్శనాలు ఉన్నాయి. అయినప్పటికీ, పయిన చెప్పినట్లుగా, తెలంగాణా రాష్ట్రం ఆర్థికస్తోమతకలిగి ఉంటుందని భావించరాదు. తెలంగాణా ఆదాయం పెరగడానికి; వ్యయం తగ్గడానికి గల అవకాశాలు చూపిస్తూ వారు ఇన్ని సూచనలు చేశారు. వాటిని పరిశీలిద్దాం.

ఏఏ ఆదాయాలను హెచ్చింపవచ్చునో; ఏఏ వ్యయాలను తగ్గింపవచ్చునో వారు సూచించారు. కాని వారు చెప్పిన మార్గాలను అనుసరిస్తే ఆదాయం ఎంత పెరుగుతుంది? వ్యయం ఎంత తగ్గుతుంది? — అన్న వివరాలను పూర్తిగా వదలివేశారు వారు. ఆ వివరాలు, ఆ వివరాలు, ప్రస్తుత సమస్యకు అనవసరం అని భావించారేమో!

### ఆదాయం హెచ్చింపు

భూమ్యాదాయం:- (i) తెలంగాణంలో రీసెటిల్‌మెంటు కావలసిన తాలూకాలు మున్ఫయి బకాయి పడి ఉన్నాయి. వాటి రీసెటిల్‌మెంటు పూర్తిఅయితే ఆదాయం రు 80 లక్షల వరకు పెరుగుతుంది. (ii) తెలంగాణా 9 జిల్లాలలోను 222 వేల ఎకరాలఆయకట్టుగల 3567 గండ్లుపడిన చెరువులు ఉన్నాయి. ఈ 3567 చెరువుల మరమ్మతుకయి రు 388 లక్షలతో కూడు కొన్న ఒక ప్రణాళిక సిద్ధం చేయబడింది. భారత ప్రభుత్వం ఇందులో 152 వేల ఎకరముల ఆయకట్టుగల 2387 గండ్లుపడిన చెరువులను మరమ్మతు చెయ్యడానికి రు 208 లక్షల అంగీకరించింది. [అప్పా? గ్రాంటా?] (iii) ఇరిగేషన్ ప్రాజెక్టులవల్ల సాగు క్రిందకి మరి 250 వేల ఎకరాలభూమి రాగలదు. అందుచే భూమ్యాదాయం హెచ్చగలదు. (iv) ఇనాములు రద్దయినకొద్దీ భూమ్యాదాయం తెలంగాణాలో మరింత హెచ్చుతుంది. ఇవీ భూమ్యాదాయం హెచ్చడానికి వారు సూచించిన అవకాశాలు.

తెలంగాణంలో ఈ సెటిల్‌మెంట్ కావలసిన తాలూకాలు సంస్థలు బకాయిపడి ఉన్నమాట వాస్తవమే. కాని హైదరాబాద్ ప్రభుత్వం అవి తప్పక రీసెటిల్‌మెంటు కాగలదనే అభిప్రాయంతో "స్పెషల్ ఎసెస్‌మెంటు పన్ను" (Special Assessment Tax) ఇదివరకే విధించారు. ఈ ఆదాయం 1953-54, 1954-55 సం॥ ల బడ్జెట్లలో ప్రవేశపెట్టబడింది. అందుచేత 1953-54 సంవత్సరానికి మనం తీసుకొన్న ఆదాయపు సంఖ్యలో ఆదాయం ఈ సంఖ్యకూడా కలిసే ఉంటుంది. అదనంగా ఆదాయం ఇంతకంటె పెరుగుతుండడానికి అవకాశాలు లేవు.

గండ్లుపడిన చెరువులను మరమ్మతు చెయ్యడం ఉత్పత్తికారకమయిన (Productive) వ్యయం కాదు. భారతప్రభుత్వం మంజూరు చేసింది అప్పా లేక గ్రాంటా అన్న వివరాలు ఇవ్వలేదు. అప్పే అయితే భారతప్రభుత్వానికి దానిని తిరిగి తీర్చవలసి ఉంటుంది. దీనినికూడా ఆదాయాన్ని హెచ్చింపుచేసే అంశంగా చూపించడం న్యాయంకాదు. ఇదీకాక; మిగతి 1180 చెరువుల మరమ్మతుకయ్యే రు 180 లక్షల వ్యయం విషయంలో నివేదిక నిశ్శబ్దంగా ఊరుకుంది. ఈ రు. 180 లక్షల వ్యయానికి బడ్జెట్‌లో అంచనా ఉన్నట్లు కనిపించదు. 1952 సం॥ మే నెలలో అధిక వర్షాలవల్ల మహబూబ్ నగర్ జిల్లాలో గండ్లు పడిన 518 చెరువుల మరమ్మతుకుగాను భారతప్రభుత్వం రు. 88 లక్షల అప్పు మంజూరు చేసింది అని నివేదికలో ఉంది. అప్పు తిరిగి ఇచ్చివేయడంవిషయం బడ్జెట్ అంచనాలలో ఉన్నట్లు కనబడదు. యీ విషయంలో కూడా నివేదిక నిశ్శబ్దంగా ఉంది. ఆదాయాన్ని హెచ్చుచేయడానికి బదులు ఈ అప్పులు వ్యయాన్ని ఎక్కువ చెయ్యడానికి తోడ్పడతాయి. యీ అప్పులను కొన్ని సంవత్సరాలలో తిరిగి ఇచ్చివేస్తామని ప్రభుత్వం వాగ్దానం చేసిఉంటే అది బడ్జెట్‌లో నిష్పత్తి పద్ధతిని చూపించవలసిఉంటుంది.

అభివృద్ధిపన్ను: తెలంగాణంలో నీటిపారుదల సౌకర్యాలు పెరగనున్నందున అదనంగా అభివృద్ధిపన్ను విధించగలమని వారు అంటున్నారు. 1953-54 బడ్జెట్ అంచనాప్రకారం హైదరాబాద్ రాష్ట్రానికంతకు అభివృద్ధిపన్నువల్ల ఆదాయం రు 2 లక్షలు. ఇందులో తెలంగాణంవాటా రు 1.18 లక్షలు ఉండగలదని అనుకోవచ్చును. ఇప్పుడు అమలులో ఉన్న రేటుకు రెటింపు రేటు విధించినా అదనంగా సుమారు ఒకలక్ష రూపాయలకంటె యీ పన్నువల్ల ఆదాయం పెరగదు.

అమ్మకంపన్ను: "రాష్ట్రంలో అమ్మకంపన్నువ్యవస్థ ఇటీవలనే స్థాపింపబడింది. యీ పద్దుక్రింద గడచిన రెండుమూడుసంవత్సరములనుండి ఆదాయము క్రమముగా పెరుగుచున్నది. అందువల్ల ముందుముందు అమ్మకంపన్ను ఆదాయం ఇంకా హెచ్చగలదని చెప్పవచ్చును. యీ ఆదాయం అంతర్‌రాష్ట్రీయ రవాణాపన్నుల రద్దువల్లకలిగే నష్టమును పూర్తిచేయుటకు చాలును"—నివేదిక.

"ఇంతవరకు ఆదాయం పెరుగుతోంది. కనక ముందు కూడా పెరుగుతుంది" అనడంలో వారి హేతువాదనాశక్తికి మనం సంతోషించవచ్చు. రెండుమూడు సం॥ల నుండి అమ్మకంపన్నువల్ల వచ్చే ఆదాయం పెరిగిన మాట వాస్తవమే. క్రిందటి సంవత్సరం మల్టిపాయింట్ సేల్స్ టాక్స్ ప్రవేశపెట్టబడింది. (అంటే ఒకే వస్తువుపై ఉత్పత్తి చేసే వాడి దగ్గర నుంచి ఉపయోగించే వాడి దగ్గరకు వచ్చేలోపుగా-అధమం- మూడుసార్లు పన్ను విధింపబడుతుంది). దానిపై స్థానిక వాణిజ్య సంస్థలు తమ అసమ్మతిని తెలుపుతూ ఆందోళనం చేశాయి. 1953-54 బడ్జెట్ ప్రకారం అమ్మకం పన్ను పయి ఆదాయం రాష్ట్రానికంతటికీ రు 2 కోట్లు. 1954-55 బడ్జెట్-అంచనా ప్రకారం కూడా రు 2 కోట్లు. ఇక అమ్మకంపన్ను పయి ఆదాయం పెరగడానికి అవకాశం ఏది" ఒకవేళ- 'లక్షరీ' సామానులపయి అదనంగా పన్ను విధించినా ఇదివరకే మ. పా. సే. టాక్స్ అమలులో ఉండడంవల్ల అన్నిచోట్ల విధించడానికి వీలు ఉండదు. అంతర్‌రాష్ట్రీయ రవాణా పన్ను రద్దుకావడంవల్ల ప్రభుత్వానికి నష్టం సుమారు రు 150 లక్షలు ఉంటుంది, అమ్మకం పన్ను ఒక 'పాయింట్'లో ఒక స్టేజిలో ఎక్కువ చేసినా 150 లక్షల రూపాయల అగత్య కలిగినంత ఆదాయం వస్తుందనడానికి అవకాశం లేదు. అందుచేత ఇది కూడా ఆదాయపు హెచ్చింపుకు గల ఒక అవకాశం అనడం న్యాయంకాదు.

వ్యవసాయ ఆదాయపు పన్ను: "ప్రస్తుతం ఈ పద్దుక్రింద ఆదాయం చాలా స్వల్పముగా గలదు. కాని ముందు తెలంగాణాలో ఇది పెరగగల అవకాశం కలదు. ఒక విటికొక ఎడు ఇరిగేషన్ క్రింద భూమి విస్తరింపబడగలదు. కావున వ్యవసాయ ఉత్పత్తులు కూడా హెచ్చి ఈ పన్నుపై ఆదాయము పెరుగగలదు"- నివేదిక వారు నివేదికలో మరచిపోయిన విషయాలు కొన్ని: 1951-52 సం॥లో ఈ పన్నుపయి వచ్చిన ఆదాయం రు. 10.49 లక్షలు. 1953-54 సం॥లో రు 6.86 లక్షలు. అంటే ఈ రెండు సంవత్సరాలలో ఆదాయంలో రు 3.63 లక్షలు తగ్గిపోయిందన్నమాట. ఆదాయపు పన్ను "గ్రేడేషన్" పద్ధతిపై వసూలుచేస్తారు. హైదరాబాదు భూమి కొలుదారీ చట్టం అమలులోకి రావడం వల్ల భూస్వామికి ఒక్కొక్కడి కుండవలసిన భూమి తగ్గిపోయింది, తగ్గిపోతూంది. దానివల్ల భూమివల్ల వచ్చే ఆదాయపు పన్ను తగ్గింది. అంటే పంచవర్ష ప్రణాళిక క్రింద సాగులోకి వచ్చే భూములవల్ల వచ్చు ఆదాయంలోని హెచ్చు-తగ్గులవల్ల ఏర్పడిన పరిస్థితులవల్ల ఆదాయంలో ఏర్పడే తరుగు-ఈ రెండూ సమానములు ఆదాయం రు 6.86 లక్షలవద్ద స్థిరంగా ఉండవచ్చు, లేదా ఇంకా తగ్గవచ్చు. ఏది ఏమైనా, ఇది ఆదాయం పెంపుదలకు చూపించే అవకాశం మాత్రం కాదు.

(సశేషం)

---

* నివేదికయొక్క తెలుగు అనువాదం ఇక్కడి "గోల్కొండ పత్రిక" రోజూ ప్రకటించబడుతుంది. ఈ సంఖ్యలు దానినుండి స్వీకరింపబడ్డాయి.